# నాగవల్లిక

(చారిత్రకమైన నవల)

గ్రంథకర్త :
విశ్వనాథ వేంకటేశ్వరులు,
ఉభయభాషా ప్రవీణ.

అశోకా పబ్లికేషన్సు,
వరంగల్.



౧

మహీశూల పట్టణపు రేవు నుండి 'నందిని' లంగరెత్తి రత్నాకరముమీఁదఁ బోవుచుండెను. నందిని రేవు వదలి నాలుగు గడియలు మాత్రమే యైనది. భూతద్దములతోఁ జూచువారికి మహీశూల దీపములు విస్పష్టముగానే కనఁబడుచుండెను. నందిని హంసాకారమున రత్నాకర తరంగములపైఁ దేలియాడుచు సౌందర్యసత్త్వముల వెలార్చు చుండెను. అది శరత్కాలము. వెన్నెల రాత్రి. చంద్రుడు నిర్మేఘమైన యాకాశమున రాజ హంసవలె ధవళధవళములైన చంద్రికాపూరములు నింపు చుండెను. ఓడనాయకుఁడు, సరంగులుఁ గడు జాగరూకులై రత్నాకరమును గమించుచున్న నందినికి సమస్త పరిచర్యలు చేయుచుండిరి. నందిని శ్యామదేశమునకుఁ బోవుచున్నది. శ్యామ దేశపు టోడరేవు విశాఖను జేరునప్పటి కేడు రాత్రులు గడచును. ఆనాటి రాత్రి రత్నాకరము పాలగచ్చుచేసిన యిల్లు వలె శరన్మేఘ సమావృతమైన యాకాశమువలె శాంత గంభీ రమై యుండెను. నందిని రత్నాకరముపై నూఱుపయనములు సాగించిన యోడ. దాని నాయకుఁడు రుద్రశ్రీ; యఱువది యేండ్లు దాటిన పండుముదుసలి. ఆతని యనుభవముతోపాటు బారెఁడుగడ్డము గూడ తెల్లనై పండుదనము వెలార్చుచుండెను. ఓడ సరంగులెల్ల ననేకవర్షములు సముద్రయానమున నాఁటి దేఱినవారు. ఆంధ్ర సామ్రాజ్యాధిపతి, శాతకర్ణి చక్రవర్తి

నందినిపై శ్యామదేశమునకు సపత్నీకుఁడై విహారమునకుఁ బోవుచున్నాఁడు. శాతకర్ణి ధర్మపత్ని, జగజ్జేత రుద్రదామ నరపాలుని కూఁతురు, రుద్రాణీదేవి. చక్రవర్తితోఁగూడ నందినిపై బ్రయాణము చేయుచున్నది. శ్యామదేశాధిపతి విజయతుంగుని కుమారుఁడు, యువరాజు వీరతుంగుఁ డాంధ్రసామ్రాజ్యాధిపతిని స్వదేశమునకుఁ గొనిపోవుటకై తన చెల్లెలు నాగవల్లికతోఁ గూడ నాంధ్రదేశమునకు వచ్చియుండెను. వా రిరువురును రాజదంపతులతోపా టిప్పుడు నందినిపైఁ బ్రయాణము చేయుచున్నారు. రాజదంపతులకుఁ బ్రత్యేకముగ నాల్గుగదు లేర్పాటు చేయఁబడినవి. శ్యామదేశ యువరాజు రాజదంపతులు విడిది చేసిన గదికిఁ బ్రక్కనే సర్వాలంకారశోభితమై యున్న మఱి యొక గదిలోఁ జెల్లెలితోఁగూడఁ బ్రయాణము చేయుచుండెను. నందిని నాంధ్రసామ్రాజ్య దండనాథుఁడు యజ్ఞశ్రీదత్తుఁడు నూఱుగురు మహాధన్వులతోఁ గాచుచున్నాఁడు. వీరు గాక వేఱుగాఁ జక్రవర్తి కంగరక్షకమైన బల మైదువందలకు మించి నది, మఱి రెండు నౌకల మీఁదఁ బ్రయాణించు చుండిరి. ఈ మూఁడు నౌకలును మూడు హంసలవలె, మూడు చుక్కల వలె రత్నాకరమును దరించుచుండెను.

ఆంధ్రసామ్రాజ్య చక్రవర్తి శాతకర్ణి వాశిష్ఠీపుత్ర పులోమావి సోదరుఁడు. పులోమావి నిస్సంతానుఁడై కాలధర్మము నొందఁగా శాతకర్ణి యాంధ్ర సింహాసనము నధిష్ఠించెను. ఇతఁడు వాశిష్ఠీ పుత్రుఁడు కాఁడు. గౌతమీపుత్ర శాతకర్ణి

కిరువురు భార్యలు. అపరాంతరాధిపతి విష్ణుదత్తుని కుమార్తె వాసవికిఁ బుట్టినవాఁడీ శాతకర్ణి. ఈయన సింహాసనము నెక్కి నప్పటికి ముప్పదియేండ్లవాఁడు. ఉజ్జయనీపతియైన రుద్రదాముఁడు తన కూతురైన రుద్రాణి నీయనకుఁ జిన్నతనమందే వివాహము చేసెను. శాతకర్ణి చిన్నతనము నుండియు రాజ్యభారము లేనివాఁడగుట రాజ్యాంగతంత్రము నందుఁగంటెఁ జతుష్షష్టి కళలయందు నాఱితేఱినవాఁ డయ్యెను. చతుష్షష్టి కళలలో నాయనకు ముఖ్యముగఁ గవిత్వ సంగీత నృత్యముల యందుఁ బ్రత్యేకాభిమానము. తన రాజ్యతంత్ర భారమునెల్ల బ్రిధానామాత్యుఁడైన విష్ణుశ్రీదత్తునియం దునిచి ధీరలలితుఁడై సంగీత నృత్యగీతా వినోదములయందుఁ గాలక్షేపము చేయుచుండెను. అట్లని రాజ్యతంత్రమునందుఁ బూర్తిగ నిరాదరము చూపుచుండె నని చెప్ప వలనుపడదు. శాతకర్ణి యగ్రజుఁడైన పులోమావి జీవించియున్నన్నినాళ్ళు నాంధ్ర సామ్రాజ్యము చెక్కుచెదరక యుండెను. ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి శాతకర్ణిని వరించిన నాఁటినుండియు నామె సకలకళాశోభిత యయ్యెను శత్రురాజన్యులయెడ నుపేక్ష చేయలేదు. ఉత్తర దిశయందు రుద్రదాముఁడు బలవంతుడై బంధుత్వభావముచేత నాంధ్ర సామ్రాజ్యమునకు రక్షక దుర్గమై నిలిచెను. లలితకళాప్రియుఁడైన శాతకర్ణి యన్యరాజ్యములతో విద్యా సంబంధముల నేర్పఱచి విద్యామిత్రులను సంపాదించెను. ఆంధ్ర సామ్రాజ్య పతాక సముద్రాంతర ద్వీపముల యందుఁ బ్రతిష్ఠింపఁబడి యఖం

డాంధ్ర సామ్రాజ్యము స్థాపింపఁబడెను. యవ బలి ద్వీపముల యధిపతులును శ్యామదేశాధిపతియైన విజయతుంగుఁడును నాంధ్రసామ్రాజ్యమును దల్లిదేశముగ భావించుచుండిరి. ఆ దీవులయం దాంధ్రసామ్రాజ్యము విస్తరింపకపోయినను నాంధ్ర సంస్కృతి చిరప్రతిష్ఠితమై యుండెను. శ్యామదేశ రాజ యువ రాజులైన విజయతుంగ రాజతుంగు లిర్వురును గవితా ప్రియులు. విజయతుంగుని కుమార్తె నాగవల్లిక చతుష్షష్టి కళా పారీణ యని ప్రసిద్ధిఁ జెందియుండెను. ఆమె ముఖ్యముగ నృత్యవిద్యయం దాఱితేఱియుండుటయే గాక భారతదేశము నందలి సమస్త నృత్యసంప్రదాయములను నేర్చుకొనవలయు నని కోరికతోఁ దమ మిత్రుఁడైన శాతకర్ణి రాజధానియందు రెండు వత్సరముల నుండి యతిథిగ నుండెను. ఆనాఁడు ధాన్య కటకము సర్వవిద్యా ప్రతినిధులకు నిలయమై యుండెను. ధాన్యకటకమునందు విద్య నేర్చినవారు భారతదేశమున మఱెందును విద్యాన్వేషులై పోవలసిన యవసరము లేకుండెను. ధాన్యకటక ఘటికాస్థానములందుఁ బరదేశీయులు నేర్వరాని విద్యలేదు. నాగవల్లిక యీ సంవత్సర ద్వితీయమును రాజున కతిథియై తన కిష్టములైన సంగీత నృత్యకవితావిద్యల రహస్య ములఁ బెక్కింటిని నేర్చెను. సంగీత నృత్యాది విద్యల సిద్ధాంత భాగములలో శాతకర్ణి ప్రవీణుఁడగుట నాగవల్లిక శాతకర్ణిక యొద్దఁ గూడఁ గొంత శిష్యత్వము నెఱపెను. ఆయన మహా రాజు. ఆమె మహారాజ కుమారిక, అగుటచే వా రిరువురకుఁ

గొంత సాన్నిహిత్య మేర్పడి, పరిచయము స్నేహమై, స్నేహ మనురాగరూపము నొందెను. ఈ కథాకాలమునాటికి నాగ వల్లికా శాతకర్ణు లొకరినొక రెడబాసి యుండలేని పరిస్థితివచ్చె నని చెప్పవచ్చును. ఇప్పుడు రాజతుంగుఁడు చెల్లెలిని స్వదేశ మునకుఁ దీసికొనిపోవచ్చెను. ఆయనకు శాతకర్ణికిఁ గొంత పూర్వస్నేహము కలదు. ధాన్యకటక ఘటికాస్థానమున వీరిరు వురును సహాధ్యాయులై యుండిరి. ఆ మైత్రిని బురస్కరించు కొని చెల్లెలిని దీసికొనిపోవచ్చిన రాజతుంగుఁడు ధాన్యకటక మున రెండు మాసములు రాజున కతిథిగ నుండి రాజ దంప తులను దన దేశమునకు రమ్మని యాహ్వానించి వారిని గూడ వెంటఁగొని రాజునకు సొంతనౌకయైన నందినిపైఁ బ్రయా ణము చేయుచున్నాఁడు.

రుద్రాణి శాతకర్ణి పట్టపుదేవేరి. అనగా నిప్పటి కాయన కితర భార్య లున్నారని కాదు తన యాభిజాత్యమునుబట్టి తన సౌందర్యమునుబట్టి, తన వస్తువాహనాది సంపదలనుబట్టి తాను శ్రీకృష్ణపత్నియైన సత్యభామవంటిదాన నని రుద్రాణి తలంచుకొనుచుండును. ఆమె మహాసౌందర్యవతి యన్నమాట మాత్ర నిక్కువము. మధ్యమదేశ స్త్రీలు సహజముగ సౌందర్య వతులు. వా రాంధ్రవనితలకంటెఁ బొడుగరులు. వర్చస్సులో గూడ వారి కాంధ్రవనితలు తీసికట్టే యని చెప్పవలయును. అందువలన రుద్రాణి ధాన్యకటక స్త్రీలలో మహాసౌందర్యవతి యని పేరు గాంచెను. ధాన్యకటక మనఁగా నానాడు సర్వ

దేశముల రాయబారులకు నిక్కా. పలువిధములైన భాషలు, పలువిధములైన కనుముక్కుతీరులు, పలువిధములైన కట్టుబొట్టుల వైఖరులు, పలువిధములైన కేశపాశబంధములు, పలువిధములైన దుస్తులతో నానాటి ధాన్యకటకము కలకలలాడుచుండె ననుట వింత కాదు. ఆ సౌందర్యమూర్తులలో రుద్రాణి చుక్కల నడుమఁ జందమామవలె వెలుగొందుచుండెను. ఆమె చదువరి కాదుగాని పలుదేశముల భాషలలో నామెకుఁ దగినంత పరిచయము కలదు. రుద్రాణికిఁ గళలయందభిరుచి లేదని చెప్ప వీలులేదు. ఆమెకుఁ గళలయందు వైరస్యము లేదు. మనస్సౌందర్య మధికమైనకొలదియు శరీర సౌందర్యమునం దభిమానము తగ్గుచుండుట లోకము పరిపాటి. రుద్రాణి శరీర మనస్సౌందర్య లుభయమును గలిగిన వ్యక్తి యగుట నామె యీ రెంటికి సమానమైన యాదరము చూపుచుండెను. ఆనాటి ధాన్యకటక స్త్రీల వేషభాషలకెల్ల రుద్రాణి మేలుబంతియై విరాజిల్లెను. విదేశ స్త్రీలు గూడ రుద్రాణి యభిరుచులనుబట్టి తమ యభిరుచులను సరిదిద్దుకొనుచుండిరి. అట్లనగా రుద్రాణి వేషభాషల యందుఁ బరదేశీయుల ముద్ర యేమాత్రములే దని చెప్పుటకు వలనుపడదు. అనేక సంస్కృతులకు, ననేక నాగరకతలకుఁ గూడలియైన నాటి ధాన్యకటక స్త్రీల కొరవడిగా నున్న యామె సౌందర్యాభిరుచులు సర్వదేశీయాంగీకార్యములై యొక క్రొత్త సౌందర్యపరిభాషను సృష్టించినట్లుండెను.

రుద్రాణి నాగవల్లికయందు స్నేహభావము తోడనే యుండెను. ఆ స్నేహభావమునందుఁ దాను మహారాజ్ఞి నన్న భావస్ఫూర్తి యుండెను. తా నతిలోక సౌందర్యవతినన్న యహంకార స్ఫూర్తి యుండెను. తాను మహాతల, దండనాయక రుద్రదాముని కూఁతు నన్న యాభిజాత్య స్ఫూర్తి యుండెను. ఆమె నాగవల్లిక యందు స్నిగ్ధురాలే కాని యది యొక యౌద్ధత్యానురంజితమైన ప్రాభవ విశిష్టమైనది. ధనవంతులు సామాన్యముగ విద్వాంసులయెడ నొక భావమును బ్రకటింతురు. అది యా విద్వాంసుల విద్వత్తయెడ మెచ్చుదలతోఁ గూడి యుండును. ఆ మెచ్చుదలలోఁ దమ ధనవత్త వలనఁ బుట్టిన యౌన్నత్యానుషక్తి యుండును. మొత్తముమీఁద నది రక్షకరక్ష్యభావప్రయుక్తమైన స్వాధిక్యభావమత్త. రుద్రాణి నాగవల్లిక యెడ నట్టి భావము కలిగియుండెను. ఆ భావము వల్లనే శాతకర్ణి రుద్రాణితో శ్యామదేశ ప్రయాణ ప్రసంగము తేఁగా, నాగవల్లి యచ్ఛమైన పసిపిల్లవలె నట్టి సంబరము చూపఁగా రుద్రాణి తన పరువు ప్రతిష్ఠలకు భంగ మే మున్నదిలే యని యెట్టకేల కంగీకరించెను.

నందిని యిట్టిభావసంపుటిని మోసికొని రత్నాకరముపైఁ బ్రియాణము సాగించుచుండెను. అచ్ఛమైన వెన్నెలలు పుక్కిలించు శరద్రాత్రులు సుమనోహరములై రత్నాకరమును ధగద్ధగిత మొనర్చుచుండెను.

---



నందిని శ్యామదేశ రాజధానియైన విశాఖను జేరఁ కొనెను. దారిలో ననగా రత్నాకరముమీఁద నందిని తుపానుఁ కగ్గమయ్యెను. కాని దైవవశమున నెట్టకేలకు సుఖముగా రేవునుఁ జేరుకొనెను. శాతకర్ణి చక్రవర్తి, యాంధ్రసమ్రాట్టు శ్యామదేశ దిదృక్షార్థియై వచ్చుచున్నా డని విజయతుంగుఁడు సంతోషతరంగతుంగుఁ డయ్యెను. శ్యామదేశము నందనవనము నంటిది. షడృతువుల యందును వసంతర్తు ప్రాయముగ నుండు నట్టిది. ఘనశ్యామములైన పర్వతారణ్య పంక్తులు, శుభ్ర జలోపేతములైన నద నదీమతల్లులు, కొండల యంచుల గువ్వలవలె గూరుచుండీ యున్న నగర దుర్గములు, చల్లని షుమనోహరమైన శీతవాతాతపస్థితియుఁ గలిగి యా దేశము భోగపురుషుల కావాసయోగ్యమై యుండెను.

రేవునందు దిగిన వెంటనే రాజపరివారమువచ్చి శాతకర్ణి చక్రవర్తికి జోహా రొనర్చెను. విజయతుంగుఁడు స్వయముగ వచ్చి శాతకర్ణి కభివాదన మొనర్చెను. మొదట శాతకర్ణియు నాగవల్లికయు నొక స్వర్ణరథము నధిరోహించి యిరుగడ నిలువబడి యున్న ప్రేక్షకజనము జే జేలు వెట్ట నగరప్రవేశ మొనర్చిరి. వెనుక రుద్రాణియు రాజతుంగుఁడును వేఱొక స్వర్ణరథముపై నధిరోహించి వచ్చుచుండిరి. ఆపై రాజ పరివారమును, రుద్రాణి పరివారమును వచ్చిరి. వెనుక నాంధ్ర

ధానుష్కు లాంధ్ర సింహధ్వజచ్ఛాయలఁ జూపఱకు [illegible] గను
పండువై వచ్చుచుండిరి. విజయతుంగుఁడు వీరినెల్ల తన రాజ
సభా భవనమునకుఁ దోడ్కొని చని యందు మంత్రి సామం
తాద్యఖిల ప్రజాపరిషత్సమక్షమున నాంధ్ర సమ్రా డ్దంపతులకు
ఘనమైన స్వాగతము నొసంగి, చీని చీనాంబరాదులచే స్వర్ణా
ద్యలంకారములచే సత్కరించి సంతుష్టుల నొనరించెను. తదుపరి
రాజు ససత్నీకుఁడు సపరివారుఁడునై యొక దివ్యభవనమున
విడిది చేసెను.

శాతకర్ణి విజయతుంగ రాజధానియందు రెండుమాసము
లుండెను. ఆ రెండు మాసములు నిత్యోత్సవములు నిత్య
సత్కారములు నెడతెఱపిలేక జరిగెను. శ్యామదేశపు గజాశ్వ
రథ పదాతిబలముల ప్రదర్శనములు జరిగెను. విందులు, వింత
వేడుకలతో శాతకర్ణికిఁ గాలము స్వర్గమునందువోలె గడచు
చుండెను. ఆయనకు స్వరాజధాని, స్వసామ్రాజముల గొడ
వయే పట్టినట్లు లేదు. రుద్రాణియు స్త్రీ సహజమైన నూత్న
వస్తు వాహనాది దిదృక్షానందమువలని సంబరము నొందుచు
భర్తతో యథాతథముగ నానందము నొందుచుండెను. శాతకర్ణి
చక్రవర్తి యొకానొక పరవశస్థితిలో నుండెనని చెప్పవచ్చును.
ఆయనకు నాగవల్లిక నిత్యానపాయిని యన్నట్లుండెను. ఆమె
క్రొత్తగీతము వ్రాయును. శాతకర్ణికి వినిపించును. శాతకర్ణి
తద్భావార్థ వ్యజ్యమానములైన ధ్వన్యర్థముల చర్వణాసాంత
త్యము నందుఁ బారవశ్యస్థితి నొందును. ఆమె యొక గీతము

పాడి వినిపించును. శాతకర్ణి తన్నాద నాదాంతానుగతమైన భావసోపానముల నధిరోహించి స్వర్గసీమల సంచరించి మఱలి భూతలస్పర్శచేయుటకుఁ గొన్ని ఘటికలు పట్టును. ఆమె యొక నృత్యము సేయును- తద్దిదృక్షాజనిత కుతూహలాతిరేక పారవశ్యస్థితియందు శాతకర్ణి తన్మయీభవనము నొంది తన్నుదా మఱచిపోవును. ప్రాతర్మధ్యాహ్నసాయాహ్నము లందు నాగవల్లికతోనే కాలక్షేపము. నాగవల్లికయే భోజనము. నాగల్లివకయే స్నానము. నాగవల్లికయే. సర్వము నయ్యెను శాతకర్ణికి- శాతకర్ణి నిత్యకృత్యములలో శయ్యాసనాది భోగములలోవింతలు వేడుకలలో రుద్రాణి సమానము గనే పాల్గొనుచుండెను. కాని రాజు నాగవల్లిక యెడఁ జూపినంత తాదాత్మ్యము, నామెతో గడపుచున్నంతకాలము రుద్రాణితోఁ గడపుట లేదు. ఉత్తమ కులమున జన్మించి, యున్నతభావ విలక్షణమైన నడవడి కలిగి, సహజముగ నాభిజాత్య ప్రాభవములు కలిగిన రుద్రాణికి శాతకర్ణి యీ ప్రవర్తనమునందుఁ దొలుదొలుత నెట్టి సంశయ సంకోచములు కలుగలేదు. రాజు కూడఁ దాను జేయుచున్న యీ పని విదేశీగతయై తానే గతిగా నున్న రుద్రాణికి బాధాకర మగునని యెంచలేదు. ఆయన నాగవల్లికతోడి పొత్తొక సహజాపన్నమైన ప్రకృతి లక్షణముగనే భావించు చుండెను. మఱియొక విషయము. రాజు బుద్ధిమంతుఁడు, పండితుఁడు. సర్వకళావేత్త. అతఁడు తాను నాగవల్లికతోఁ జనవు కలిగియుండుట యొక భోగ

లాలసాలక్షణ మని తలంపలేరు. కవి యెప్పుడు నొక భావ మును జర్వణము చేయుచుండును. సంగీతకుc డొక రాగము నెప్పుడు నాలాపించుచు బ్రస్తారము చేయుచుండును. నర్తకి యొక భంగిమ నెప్పుడును భావన సేయుచుండును. నృత్య విద్యాపారీణయైన యొక యిల్లాలు వంటసేయుచు గూడ నొక పాదవిన్యాసమునో, యొక భ్రూభంగిమనో, యొక నేత్ర చలనమునో భావించి యనుష్ఠించు చుండును. ఇది వారి యభ్యాసవైఖరీ పరిష్కృతమైన మనోవృత్తి సాంతత్యముకాని దానిని వ్యసన మనుటగాని నియమరాహిత్యజన్యమైన స్వేచ్ఛా చార మనుట గాని పొసగదు. అది యొక తపస్సుగా భావు కులు వర్ణింతురు. శాతకర్ణికి నాగవల్లికకు నున్న యీసంబంధ మిట్టి తపస్సని వర్ణించినచో నతిశయోక్తి కాదు. శాతకర్ణి కవి, గాయకుcడు, నర్తకుcడు, కళావేత్త. ఏ కళకైనను భావ క్రియల రూపమున రెండు విధములైన యవస్థ లుండును. భావము మనోరూపమై క్రియశారీరకమై యుండును. ఈ భావ క్రియలు రెంటికి నాత్మమూల మనుట నిర్వివాదాంశము. ఆత్మ యనcగా నిక్కడ నుపనిషత్ప్రతిపాదితమైన పరమాత్మ కాదు. కాక యనేక జన్మవాసనా సంస్కార పరిమిశ్రితమై యావరణ విశిష్టమైన జీవాత్మ యిది- అనేక జన్మవాసనా సమష్టి చేతనాభిధ నొంది జీవాత్మను బరివేష్టించి యుండును. అది సర్వ రసాత్మక మైనది-అది ప్రవృత్తిలోని భాగమే. ప్రవృత్తి రూపమైన యభ్యాసచేత ననురంజితమైన వాసనా సమష్టియే

చేతన యనఁబడును. నివృత్తిరూపమైన యభ్యాసాభ్యాసము చేసిన యోగీశ్వరునకు సర్వరసనివృత్తి జరుగును. తన్మహాస్థితి నుండి చ్యుతుఁడైన జీవునకుఁ జేతనారూపమున సర్వరసోద్బోధము కలిగి యతఁడు మహాకవిగా, మహాగాయకుఁడుగా, మహానర్తకుఁడుగా జన్మించును. ఇట్లు స్వరసాత్మకమైన చేతనోద్బోధముతోడి జీవుఁడు సర్వమునందు సౌందర్యమును దర్శించుచు నానందాభాసముచే లోకములో సుకుమారములైన జన్మల నొందుచు సుఖదుఃఖాదికముల నొందుచున్నాఁడు. ఇట్టి సుకుమారజీవిని లోకము భరించదు. అది వాని దౌర్బల్యమో, దౌష్ట్యమో, దౌర్గత్యమో యని యెంచి వానిని వెఱ్ఱివాఁడుగ నెంచి తృణీకరించును. ఇట్టి జీవాత్మతో మెలగు దేహి కళాతపస్వియై స్థూలదేహావరణమునందుఁ గూడఁ దన కభ్యస్తమైన కళాంశను జూచుచు దానియందు రమించుచుండును. శాతకర్ణి యిట్టి స్థితిలో నుండెను. ఆతని మనోభావనారూపమైన కలాజగత్తునకు నాగవల్లిక క్రియారూపావతారముగా నుండెను. నాగవల్లిక లేనిదే తన కళాజిజ్ఞాస లేదు. తన కళాజిజ్ఞాస లేనిదే తాను లేఁడు. ఇది శాతకర్ణి పరిస్థితి.

కాని యింద్రియప్రత్యక్షజ్ఞానముపై నాధారపడి భావనాజగత్తు యొక్క యాత్మ జగత్తు యొక్క స్థితి నంగీకరింపక, కేవలము మజ్జామాంసాస్థిమయమై స్థూలమైన శరీర స్థితిని మాత్రమే పరిగణించు సామాన్యలోకులకు శాతకర్ణివంటి భావుకుల చేష్టల యందు వైపరీత్యము గోచరించు చుండును.

లోకము శాతకర్ణి ననుమానించినది. సంశయించినది- నీలాప నిందలు వైచినది. దీనికిఁ గారణ సామగ్రియుఁ దగినంత యున్నది.

శరీర మే ప్రధానముగ నెంచు లోకము వేషభాషలకు జేష్టావిలాసములకు గూడఁ బ్రాధాన్య మిచ్చును. నాగవల్లిక వేషభాష లట్టివి. ఆ దేశవాసుల యొక్క, వారి స్త్రీలయొక్క చేష్టా విశేషము లట్టివి. శరీరము రసపుముద్ద. సంయోగ వియోగములచే నాంతర రసము లుప్పొంగును. ఆంతరరస ముప్పొంగినంతనే శారీరకములైన నాడులు స్పందించి తద్గత భౌతిక రసములందు గూడ వికారాదులు జనించును. భౌతిక వికారములకు భావవికారములకుఁ బరస్పరము జన్యజనక భావ మున్నది. అందుచేత భారతీయ ధర్మశాస్త్రవేత్తలు స్త్రీ-పురుష సంయోగము పనికిరా దనిరి. మాతృపుత్త్రిలు గూడ నేక శయ్యాగతులు కారా దని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. విదేశీయులైన ప్రాచ్య పాశ్చాత్యుల కీ రహస్యము తెలియదు- వారికి స్త్రీ పురుషుల స్వేచ్ఛాసంపర్కమునం దెబ్బట్టు లేదు- నాగవల్లిక శ్యామదేశవాసిని. ఆమె బాహిరమునకుఁ గట్టుకొను నది యొక పట్టుతో నేసిన యంగదట్టము. ఊర్ధ్వశరీరమును గప్పునది యొక్క నిచోళిక. భారతీయస్త్రీలు సర్వదేశములవా రొంటియందే భాగము నితరదృష్టికి గానరాకుండ సర్వాంగ ములయం దావరణ మేర్పఱతురు. ఇది శాతవాహనుల కాలము నాఁడు లేకుండెను గాని మొత్తముమీద భారత స్త్రీలు

దేహాచ్ఛాదనమునం దలవాటుపడినవారు. తదితరుల కీ పట్టింపు లేదు. నాగవల్లిక దేహమునం దర్ధ భాగము నగ్నముగానే యుండెను. ఏక నిచోళికా గుప్తమై యున్నతమై యున్న యామె వక్షస్థలము కామిజన లాలసాప్రేరకమై యుండెను. నిత్యాభ్యాస వశమున నర్తన శీలములై నగ్నములై యున్న యామె పాదములు సర్వజనాభిగమ్యములై కన్పట్టుచుండెను. అమె శాతకర్ణి యెదుటఁ దూనీఁగ, సీతాకోకచిలుక, కోకిల, పోతుపిట్ట నెదుట రిరంసా నిమగ్నమై నర్తించుచున్న యాడు పిచ్చుక. శాతకర్ణి యామెయందుఁ దాదాత్మ్యము నొందు టలో వింత యే మున్నది. ఇరువురు ప్రౌఢ వయస్సు నందున్న వారు. ఇరువురు రాజవంశజులు. ఇరువురు నిర్నిబంధ స్వాతంత్ర్య పరిశోభితులు. ఇరువురకు లోకమన్నఁ దృణప్రాయము. ఇరు వురును ధర్మదూరమైన సంయోగదశా పరిచ్యుతు లని లోక మన్నది. ఈ వార్త ద్వీపాంతరములకుఁ బ్రాకినది. మహా చక్రవర్తి - ఎంత విశాలమైన యశస్సు కలదో యంత విశాల మైన యపనింద తోడుగా నుండును గదా! "నలోకః పార మార్థికః."

---

# 3

శాతకర్ణి శ్యామదేశమును జేరిన ప్రథమదినమున నౌకా శ్రీయమునకుఁ బ్రత్యేకాహ్వానముపై వచ్చిన ఘనులలో భదంత శ్రేష్ఠి యొకఁడు. ఆయన 'యుజ్జయినీవాసి. రుద్రదాముని చిన్నతనమునుండియు నెఱింగి యుండుటయే గాక రాజ కుటుంబముతో సన్నిహితమైన సంబంధము కలవాఁడు. భదంత శ్రేష్ఠి నవకోటినారాయణుఁడని ప్రసిద్ధికెక్కిన వాఁడు. ఆయన కిరువది వ్యాపారనౌక లున్నవి. ఆసేతుశీతాచలము నడయా డుచు నపారమైన వాణిజ్యమును నిర్వర్తించు వీరవణిజసంఘము లఱువదికిఁబైగా నాయన చేతియందున్నవి. రాజులు మాఱినను, రాజ్యములు మాఱినను, నెన్ని ఢామడాంబరములు వచ్చినను వీరవణిజుల వాణిజ్యమునకు క్షతిలేదు. శక యవనాదులైన పర దేశీయ రాజన్యులు దేశముపై దండెత్తి వచ్చినప్పుడు వారి వాణిజ్యమునకుఁ గొంత యుపప్లవము వచ్చినను నచిరకాలము నందే రాజ్యములు సుస్థిరమై మఱల వీరవణిజుల విహారమున కంతరాయము లేకుండ సాగుచుండెను. ఉప్పుతోఁ బదియును నీ వణిజుల మూలముననే దేశీయులందఱకు నందుబాటులోనికి వచ్చుచుండెను. పండిన దేశముల నుండి యెండిన దేశములకు సరకులను సరఫరా చేయుటకీ సార్థములే సాధనములుగా నుండెను. వీరు దేశమునందలి యాంతర వాణిజ్యమునే గాక పరదేశములతో వాణిజ్యమును గూడ వీరే చేయుచుండిరి. శ్యామ

దేశమునుండి రత్నములు యవద్వీపమునుండి సుగంధ ద్రవ్యములు, సుమిత్ర బలి ద్వీపములనుండి పగడములు, ముత్యములు భారతా దీతర దేశముల కెగుమతి యగుచుండెను. అట్టి వ్యాపార మంతయు భారత వీరవణిజ సార్థములచేతులయందే యుండెను. ఇట్టి సార్థములకు నాయకుఁడై భదంతశ్రేష్ఠి కోట్లు సమార్జించి నాఁడు. రాజులు మాఱుచుందురు, రాజ్యములు తలక్రిందులగు చుండును. భదంతశ్రేష్ఠి ప్రాభవమునకు మాత్రము మార్పు లేదు. దీనికిఁ గారణము వేఱొకటి కలదు. ఆయన చెప్పు చేతలలో మెలఁగుచుండు రాజులు పెక్కురు కలరు. ఈ కథా కాలమున కాయన పెట్టుబడి నాశించి యాయన కధమర్ణులైన రాజులు పదిమందియైనఁ గలరు. రాజనీతి యర్థముపై నాధార పడి యుండును. అర్థకామములు రెండు నక్కసెల్లెండ్రు గదా! విజేతలైన రాజన్యు లెల్లరు సాధారణముగ నిట్టి యర్థపతుల సాహాయ్యముపై నాధారపడి యుండుట వింత కాదు. ఆనాటి భారతదేశపు టార్థికస్థితికి భదంతశ్రేష్ఠి వంటివా రిర్వురు ముష్వురు మూలస్తంభములై యుండిరి. వర్ధమాన రాజ్యములు కల నరపతు లెల్లరు భదంతశ్రేష్ఠి పెట్టుబడుల నాశించుచునే యుండిరి. ఏరాజ్యముపైనేని దండెత్తవలయు నన్నచోఁ గోట్ల కొలఁది దీనారముల వెచ్చింపవలసి యుండును. దానికి సార్థ వాహ చక్రవర్తులే మూలము. ఏ మహాచక్రవర్తులో యంగ బలము నర్థబలము సమానముగాఁ గలవారు వారి పలుకుబడికి లోనుగాకుందురు గాని తక్కిన యల్ప రాజన్యు లెల్లరు వారి

నాశ్రయించియే యుండిరి. ఈ కథా కాలమునకు భదంతశ్రేష్ఠి సాహాయ్యము నర్థించి, తన్మూలమున విజేత నన్న పేరు సంపాదింపఁ దలపెట్టి, యువ్విళ్లూరుచున్న వారిలో రుద్రదాముఁ డొకఁడు.

భదంతశ్రేష్ఠి ప్రౌఢవయస్సున నున్న వాఁడు. అతఁడు రుద్రాణిని చిన్నతనము నుండియు నెఱుఁగు నని యిదివఱకే చెప్పి యుంటిమి. ఎఱుఁగుటయే కాదు, ఆ రాజకుటుంబముతో నతనికి సాన్నిహిత్యమును గలదు. మఱియొక యంశమేమనఁగా నాంధ్ర సామ్రాజ్యముపై భదంతునకుఁ గొంత యీసడింపు గలదు. భదంతుని సార్థములకు ఘంటాపథ మాంధ్రసామ్రాజ్యము నుండియే కలదు. ఆనాఁటి వాణిజ్యఘంటాపథములలో నొకటి ధాన్యకటకమునుండి ప్రతిష్ఠానము మీఁదుగా భరుకచ్ఛ పోజ్జయినులకుఁ బోవుచుండెను. ఈ సార్థములు పోవునప్పుడవి రాజులకు సుంకములు చెల్లింపవలసి యుండును. సాధారణముగ సార్థములు సుంకములు చెల్లింపక తప్పించుకొనఁ జూచుచుండిరి. కాని యాంధ్రసామ్రాజ్యమునఁ బ్రభుత్వ పరిపాలన విధానము పటిష్ఠముగ నుండుటచే నెక్కడి సుంకము లక్కడ ఖచితముగ వసూలు చేయుచుండిరి. తప్పించుకొని ప్రతారింపఁ జూచువారిని శిక్షించుచుండిరి. భదంతుని సార్థము లాంధ్రసామ్రాజ్యమున నిట్లనేక సమయముల యందపరాధములు చెల్లింపవలసి వచ్చెను. దాని మూలమున భదంతునకుఁ గొంత నష్ట కష్టములు సంభవించినవి. అది యట్లుండఁగాఁ గేవలము కళాజిజ్ఞాసాపరుఁడై రాజ్యభార

మంతయు నమాత్య ప్రధానులపైఁ బెట్టి విలాసముగఁ జరించు చున్న చక్రవర్తిపై నచ్చముగ వ్యాపారబుద్ధి గలిగిన భదంతుని వంటివారి కనురాగము కలుగదు. ఆనాఁటికి శాతవాహన సామ్రాజ్య మింకను దక్షిణాపథము నంతను నావరించియే యుండెను. సామ్రాజ్యోత్తర భాగమున రుద్రదామునివంటి వీరులు విజృంభించుచుండిరి. కాని తక్కిన దిశలయందు సామ్రా జ్యము సుస్థిరముగనే యుండెను. శాతకర్ణి భోగపరుఁడని యస మర్థుడని భదంతాదుల కనాదరము జనించెను. కాని యాంధ్రుల బలము చూచి వారేమియుఁ జేయఁజాలకుండిరి. ఆంధ్ర సామ్రాజ్య ప్రధానామాత్యుఁడైన విష్ణుశ్రీదత్తుఁడు ముల్లోక ములను మూటఁగట్టఁ గలిగిన మేధాసంపన్నుఁడు. రాజెట్లు న్నను నమాత్యుని ప్రతిభాసంపత్తి ముందు వెలిరాజు లాగలే కుండిరి. రుద్రదామునకు రాజ్యకాంక్ష కలదు. ఆతఁడు దక్షిణ ముగా విజృంభింప వలయును. అక్కడ నున్న దాంధ్ర సామ్రాజ్యము. అది తన కూఁతు సొమ్ము. దాని నాక్రమించుట యేమి రాజనీతి. భదంతున కీ కిటుకు తెలియును. ఆయన రుద్రదాముని బ్రేరేపించి యాంధ్రసామ్రాజ్యమును బరిభవింప వచ్చును. శ్యామదేశమున శాతకర్ణి పొందిన నొకనింద భదంతుని యూహల కొక యాదరు వయ్యెను.

భదంతుఁ డొకనాఁడు రుద్రాణిని దర్శించెను. వినయ విన మితుఁడై చక్రవర్తిని యెదుట సముదాచారము నడిపెను. రుద్రాణి భదంతునిఁ జూచి నవ్వెను. చిరపరిచయ జనితమైన

చనవు నాధారముచేసికొని భదంతుఁడు ప్రసంగము లోనికి దిగెను. రుద్రాణి ప్రసన్న చిత్తయై యుండెను. భదంతుని యందామె తన పుట్టింటి బందుగుల జూచెను. సంభాషణక్రమములో భదంతుఁడు కొంత స్వాతంత్ర్యము నొంది మాటలాడ సాగెను. వారి సంభాషణ మిట్టి రూపము నందెను.

'చక్రవర్తులు శ్యామదేశమున స్వేచ్ఛఁగా క్రీడించుచున్నారు.'

'ఆయన చక్రవర్తి కదా! ఆయన స్వేచ్ఛకు లోపమేముండును.'

'నాగవల్లికను భోగినిగా స్వీకరింతురని లోకము చెప్పుకొనుచున్నది.'

'నే నది విన లేదు.'

'తమరు వారిని జూచి — — — — '

రుద్రాణి భదంతుని వంక నొక చుఱుకైన వీక్షణము ప్రసరింపఁ జేసెను. దానితో భదంతుఁ డాగి పోయెను. 'తమ కేదేని నవసరమున్నచో నాజ్ఞాపత్రిము పంపుఁడని' భదంతుఁడు పనివినియెను.

రుద్రాణి మనస్సులో నాలోచన సాగెను. ఈ రెండు నెలలలో రాజు నడవడి యంతయు నామె మనఃఫలకమున నొక్కసారి ప్రసరించెను. అనుమానింప మొదలు పెట్టుము. సర్వము ననుమానాస్పదముగనే కన్పట్టును. ఈ చక్రవర్తి

తన యెడల నింత విరసుఁడా ? తన యాభిజాత్యము, తన సౌందర్యము, తన శుశ్రూషాపరత్వము, తన ప్రేమ, తన పట్టమహిషీత్వము, తన శక్తి సామర్థ్యములు — నివి యేమియు గణన కెక్కుచున్నట్లు లేదు. ఆ నాగవల్లిక, దాని యుసురెంత ? అది యొక పండితురాలా ? చక్కని చుక్కయా ? దాని వేష భాషలు, దాని యునికియే తన కెబ్బెట్టుగా నుండు చుండెను. కాని రాజును జూచి, తన పదనీ సౌభాగ్య మును నమ్మి, దాని నింతవఱకుఁ దాను జూచి చూడ నట్లూర కుండెను. ఈ రాజు తన్ను నిరాదరించునా ? తా నెవరు ? మహాతలవర, మహాదండనాయక రుద్రదాముని తనయ యని గుర్తులేదా ? తాను దలఁచుకొన్నచో నేమి చేయలేదు ? అయిన నింతలో నింత తొందరపడుట యెందులకు ? రాజుతో నీవిషయము ప్రస్తావించుట తన పదవికిఁ దగిన విషయమా ? తానా విషయము ప్రస్తావింపనే ప్రస్తావింపదు. మఱి యేమి చేయును ?

ఇంతలో నొక పరిచారిక వచ్చి 'యమ్మా ! చక్రవర్తులు ఱేపు బలిద్వీపమును జూడఁ బోవుచున్నారు. తమరిని గూడ సిద్ధము కమ్మన్నా' రని చెప్పెను. 'నాగవల్లిక బలిద్వీపమునకు వచ్చుచున్నదా ? '. యని రుద్రాణి ప్రశ్నింపఁగా' అమ్మా ! శాంతిలేని కషాయమా ?' యని పరిచారిక చమత్కరించెను. రుద్రాణి మఱల నాలోచనాధీన మనస్కురాలయ్యెను. ఈ చక్రవర్తిని నాగవల్లికను బంధించినచో ? ఇది శ్యామదేశము.

ఆంధ్రదేశము కాదు— ఉజ్జయిని కాదు- ఆంధ్రదండనాయకుఁడు రుద్రశ్రీ తన యాజ్ఞలను నిర్వహించునా ? నిర్వహింపక పోవచ్చును. పరదేశమున, శత్రుమధ్యమునఁ దానొకర్తుక యేమి చేయఁగలదు.

రుద్రాణి మఱియొక విధముగ నాలోచించెను. ఈ చక్రవర్తిని బెదరించి చూచెదను. చక్రవర్తికి శరీరము స్వస్థముగా లేదు. పరదేశప్రయాణము చేయునట్టి యారోగ్యము వారికి లేదని కబురు చేయింతునని రుద్రాణి యొక పరిచారికను బిలిచి తానన్నట్లుగాఁ జెప్పుమని యామాట కబురు చేసెను. ఈ వార్తను దెచ్చిన పరిచారిక వెళ్ళునప్పటికి శాతకర్ణి రాజ వసతిగృహమున లేఁడు. నాగవల్లిక యంతఃపురమున కేగె నని భటులు చెప్పిరి. పరిచారిక యక్కడికి వెళ్ళెను. వెళ్ళి చూడఁగా రాజీ లోకములో నున్నట్లు లేదు. రాజ నాగవల్లిక లిర్వురు నభిముఖముగా గూర్చుండి యుండిరి. నాగవల్లిక రాజు బొమ్మను జిత్రించుచుండెను. రాజు నాగవల్లిక వంకఁ దదేక దృష్టితోఁ దిలకించుచుండెను. దేవేరి కస్వస్థతగా నున్నది. ఆమె యవ బలిద్వీపము యాత్రలకు రాలేమని చెప్పి రమ్మన్నారని పరిచారిక చెప్పఁగా రాజు సమాధానము చెప్పలేదు. ఊ కొట్ట లేదు. ఆయన మోమున నెట్టి వికారమును గానరాలేదు. పరిచారిక రాజేమైన సమాధానము చెప్పునేమో యని యఱ ముహూర్త మోపిక పట్టెను. సమాధానము లేదు. పరిచారిక తిరిగి పోయెను.

౪

శాతకర్ణిది చిత్రమైన ప్రకృతి. ఆయన యెవరేమి చేసినను నెప్పుడును గాదనఁడు. తన యాజ్ఞల నెవ్వరతిక్రమించి నను రాజు ముఖమున రోషభావ ముదయింపదు. ఆయన యాజ్ఞాతిక్రమణము సాధారణముగ జరుగదు. ఆయన యస లెవ్వరి నాజ్ఞాపింపఁడు. కావున నతిక్రమణమే జరుగదు. రాచ నగరులో రాజపరివారములో సర్వము ననూచానముగఁ బూర్వ మెట్లు జరుగు చుండెనో యట్లే యొకరు చెప్పనవసరము లేకుండ జరిగిపోవుచుండును. సర్వవిషయములు నిట్లు జరిగిన వని రాజకంచుకులు విన్నవింతురు. శాతకర్ణి విని యూర కుండును. రుద్రాణి యస్వస్థతచే యవ బలిద్వీప యాత్రకు వచ్చుటలేదని పరిచారిక చెప్పిన మాట రాజు వినెను. రాజప్పుడు దానికి సమాధానము చెప్పకపోవుట రుద్రాణిపైనున్న యుపేక్షాభావము వలనఁగాదు. ఆయన కది యలవాటుగా నున్న వర్తన విశేషము. దానికి రుద్రాణి తప్పుటర్థము చేసెను. సర్వార్థములకు నవస్థాభేదమును బట్టి వ్యాఖ్యానము చేయఁ బడును. వ్యాఖ్యానము వలన విశేష ప్రతిపత్తి కలుగును. రుద్రాణి కొక భ్రాంతిచే నొక కోపవృత్తి కలిగినది. దానికి రాజు తూష్ణీంభావము సమిధయైనది. రుద్రాణి కోపము రాఁజి జ్వాలయైనది. రుద్రాణి భదంతునకుఁ గబురు జేసెను. పదివేల దీనారములు కావలయునని యనెను. తన పరివారిమును దానును

స్వదేశమున కేగుట కైదువేలు కావలయును. తక్కిన సొమ్ము వైఖర్చుల కగును. భదంతుఁ డాశ్చర్యమే పొందెను. తాను వేసిన బీజమింతలోనే మొలకెత్తునని యతఁడు భావింపలేదు. అది దైవ సంకల్పముగా నున్నది. శాతకర్ణిపై నతని కంతరాంతరములలో నొకానొక పగయున్నది. అది తీర్చుకొనుట కిది తగిన యదనుగాఁ దోఁచినది, పైగా నాంధ్ర సామ్రాజ్ఞి. తన కథమర్ణురాలనగా నది యెంత ప్రతిష్ఠాహేతువు. చిత్తము, ఱేపు పంపింతునని యాయన సెలవు పుచ్చుకొని పోయెను. మఱునాఁడు భదంతుఁడు పదివేల దీనారములు పంపించెను. అప్పుడొక చిత్రము జరిగెను. మఱియొక గంటలోఁ బదివేల దీనారములు భదంతునకుఁ దిరిగివచ్చెను. భదంతున కిది యర్థము కాలేదు: ఆతడు రిచ్చవడెనని చెప్పవచ్చును. ఆంధ్రుల రాజనీతి యాొత్తరాహుల కర్థము కాదనుట కది నిదర్శనముగా నుండెను. రుద్రాణి ప్రయాణ మాగలేదు. పైగా నామె విశాఖ రేవునకు వచ్చినప్పు డామెను సాగనంపుటకు శాతకర్ణియు వచ్చెను. చక్రవర్తి దంపతు లొకరినొకరు చూచుకొనిరి. ఎవరితో నెవ్వరు నేమియు మాటాడలేదు. రుద్రాణి పరువు కొఱకుఁ బెనఁగులాడు చుండెను. శాతకర్ణి కిదియొక ప్రధానాంశముగాఁ దోఁచలేదు.

ఈ కళాతపస్వు లొకవిధముగా స్వార్థపరులు. వారు సర్వకాల సర్వావస్థల యందును దమ మనోవృత్తులయందే తాము రమించుచుందురు. లౌకికములైన ద్వంద్వములు వారి

నెక్కువగాఁ బరితాపపెట్టవు. వారి దొక లోకము. అది మనో నిర్మితము. దానియందే సర్వావస్థల నొందుచుందురు. వారికి దుఃఖము లేదా యన్నచో దుఃఖము నున్నది, సుఖము నున్నది-కాని యవి యన్నియు మనఃకల్పితములు. మనఃకల్పితమైన దుఃఖము శరీరదుఃఖము కంటె విలక్షణమై యుండును. ఎందువల్ల ననగా శరీరగతమైన దుఃఖము విషయగతము. అనగా నాత్మగతము. ఆత్మకు దుఃఖము లేదుగదా యనవచ్చును. ఈ ఆత్మ పరమాత్మ కాదు- తదను ప్రాణితమై యనేకావరణవిశిష్టమైన జీవాత్మ యిది. కావునఁ గళాతపస్వి యగువాని జీవాత్మ తానొక లోకమును బ్రత్యేకముగా సృష్టించుకొనును. అట్లు స్వసృష్టమైన లోకవిశేషము నందుఁ గ్రీడించుచు వ్యవహారసంకులమైన బాహ్యలోకమును బట్టించుకొనకుండును. అది లోకమునకుఁ గంటకింపుగ నుండును. రుద్రాణీశాతకర్ణుల విషయములో జరిగిన సంగతియే యిది. రుద్రాణి వ్యవహారమగ్నమైన చిత్తవృత్తి కలిగినది. శాతకర్ణి సంపూర్ణముగఁ దన కలాబుద్ధివృత్తి నిర్మితమైన యొకానొక మృషానంద లోకమునఁ గ్రీడించుచున్నవాఁడు. రుద్రాణి రుష్ట. శాతకర్ణి తటస్థుఁడు. సాక్షి. వానికి సంయోగ వియోగములు లేవు. రుద్రాణి కున్నవి. ఇంకొక చిత్రమేమనఁగా రుద్రాణీ శాతకర్ణు లొకరి నొకరు పరిశీలించుకొనకుండిరి గాని వారిరువురి వృత్తుల ననుక్షణము పరిశీలించుచు వడిదుడుకు లేమియు గలుగకుండ సంరక్షించుచున్న వేఱొక నేత్రము జాగరూకమై యున్నది. అది మహామాత్య

విష్ణుశ్రీదత్తుని ప్రజ్ఞాచక్షువు. ఆయన శ్యామదేశమున సన్నిహితుడు కాదు గదా యనవచ్చును. కాని మహామాత్యుని సర్వాధికారములొందిన దండనాయక రుద్రశ్రీ యుండే యున్నాఁడు. ఆయన యీ సమ్రాడ్దంపతుల యోగక్షేమము లణ్వణువునఁ బరీక్షించుచునే యుండెను. చారచక్షులైన యతనికి భదంతుని పెట్టుబడిలోని పరమార్థము తెలియును. అది బీజముగా, దానినుండి యొక మహావిషవృక్షము పుట్టవచ్చుననియు, దానిని మొలక యందే త్రుంచినచో సామ్రాజ్యమునకు మంచిదనియు రుద్రశ్రీ యాపదివేలదీనారములను వెంటనే భదంతునకుఁ బంపివేసెను. భదంతుఁ డిది యెఱుఁగమి బేలు వోందెను.

నాగవల్లీకాశాతకర్ణులు యవద్వీపమునకు బోయిరి. బలిద్వీపమును దర్శించిరి. చుట్టునున్న పలుదీవుల దర్శించిరి. రుద్రాణియు నామె పరివారమును దక్క యాంధ్ర సమ్రాట్పరివారమంతయు వారితోడనే యుండెను. ఆ కాలమున నా ద్వీపములందెల్ల భారతీయ సంప్రదాయమే సర్వాచారముల యందు ముద్రింపఁబడి యుండెను. భారతీయదేవతాగారములు, భారతీయసంస్కృతి విశేషము సర్వత్ర పొడచూపుచుండెను. అక్కడి రాజులు కూడ నంధ్రసామ్రాట్టునకు ఘనమైన స్వాగత సత్కారముల జేసిరి. శాతకర్ణి మాత్రమీ సత్కారాదికముల నానుషంగికముగనే చూచుచుండెను. అతని ప్రధానాశయము ప్రకృతి పరిశీలనము. లోకావేక్షణము. సృష్టిసౌందర్యాను

భవము. తాను స్వామాట్టునని, తన యధికార మంతయో యింతయో యీ దీవులపై నున్నదని, తన్ను వారు సేవింప వలయుననియు శాతకర్ణి హృదయమున లేదు ఆ దృష్టి కొంతగాకపోయిన గొంతయైన నున్న రుద్రాణి స్వరాజ్యము చేరినది. అందువలన శాతకర్ణి యీ యాత్ర యచ్చముగాఁ గళాయాత్రయైనది.

ప్రపంచ మారోపస్వరూపము. ఏదో యొక వస్తువున నేదో యొక లక్షణమును నీ వారోపింపుము. క్రమముగా నది దాని స్వరూపమై పోవును. స్వరూపమునందుఁ దటస్థలక్షణము గూడ నంతర్గతమై యుండును. కాలము గడువగా నిది స్వరూపము నిది తటస్థము నని విచక్షణచేయుటకు వీలులేకుండఁ బోవును. నాగవల్లికాశాతకర్ణులు ప్రణయినీ ప్రణయులని లోకమారోపించినది. వారి కళాతపోరహస్యమును వ్యవహార బద్ధచిత్తులైన లోకము తెలిసికొనలేకపోయినది. వారిర్వురు యవ బలి సుమిత్ర ద్వీపోద్యానముల యందుఁ జిలుక గోరు వంకలవలెఁ గేకిసలుకొట్టుచుఁ దిరుగుచుండగా శరీరబద్ధమైన లోకము వారి శరీరసంయోగము నుత్ప్రేక్షించినది. సామాన్య లోకము శరీరమును దాటలేదు. ఒకఁడు శరీరము నతిక్రమించె నన్నచో నమ్మలేదు. నేను శరీరమను, నేను జీవుఁడను- ఇవి రెండును రెండు భిన్నమైన యవస్థలు. నేను శరీరము నను నవస్థ దాటినవాఁడు కళాతపస్వి. నేను జీవుఁడ నను నవస్థ నతి క్రమించినవాఁడు యోగి. నాగవల్లికాశాతకర్ణుల నా ద్వీప

ముల వారు నవదంపతులుగా భావించిరి. నవవధూవరులుగా నుత్ప్రేక్షించిరి. నవప్రణయులుగా సంభావించిరి. నవరాజ్ఞీ చక్రవర్తులుగాఁ బూజించిరి. యవద్వీప పాలకుఁడైన విక్రమధ్వజుఁడు తన స్వాగతపత్రమున నంధ్ర సమ్రాజ్ఞీ సమ్రాట్టులని లిఖిత పూర్వకముగ వ్రాసెను. అట్లే తక్కిన ద్వీపపాలకులు గూడ వారిని సంభావించి సత్కరించిరి. శాతకర్ణి కివియేమియును బట్టలేదు. ఆయన యొక రసపారవశ్యమున నుండి యిట్టి స్వల్పాంశములఁ బట్టించు కొనకుండుట యలవాటై పోయినది. కాక, యీ విషయమున నాయన యంగీకారముకూడ నున్నదేమో యాయన జీవనసాక్షికే యెఱుక. రుద్రశ్రీ తన సమ్రాట్టున కట్టి భావము కలదనియే యెంచెను. శ్యామదేశ యువరాజు రాజతుంగుఁ డట్లే తలంచెను. ఒక్క శాతకర్ణి తక్కఁ దక్కిన వారెల్ల నట్లే యెంచిరి.

యవాది ద్వీప పర్యటనమైన తరువాత నీ కళాయాత్రికులు మఱల శ్యామదేశమునకు వచ్చిరి. వారక్కడికి వచ్చునప్పటికి శ్యామదేశాధిపతి విజయతుంగుఁడు పంపిన పానకపుకావడు లెదురైనవి. విజయతుంగుఁడు తన కుమార్తె యగు నాగవల్లికను శాతకర్ణికి దేవేరిగా నిత్తునని వరునిపక్షమున నున్న పెద్దలతో విన్నవించెను. తత్రత్యులలో విద్యావయోవృద్ధుఁడైన రుద్రశ్రీ తన రాజు పక్షమున నా సంబంధము నంగీకరించెను. విజయతుంగున కిది జీవితములో మహోత్సవ సమయము. ప్రాచ్యదేశములలోని కెల్ల మణిపూసగా వెలుఁగుచున్న

యంధ్రిసామ్రాజ్యాధినేత తన కల్లుఁడైనాఁడన్న నే మహా రాజున కానందము లభింపదు? విజయతుంగుఁ డానందపడెను. రుద్రిశ్రీ సంతుష్టి నొందెను. తక్కిన రాజపరివారము సంబరము నొందిరి. శాతకర్ణి నిస్తరంగ జలధి. ఆయన యేమనుకొనెనో తెలియదు. నాగవల్లీకాశాతకర్ణులు దంపతులైరి.

---

౫

వాగవల్లికా శాతకర్ణుల వివాహము నెలదినములు జరిగినది. ఆ నెలదినములు లెక్కలేని వింతలు వేడుకలతోఁ గాలక్షేపము జరిగెను. విజయతుంగుఁడు సర్వదేశాధిపతులకు శుభలేఖలు పంపెను. భారతదేశము నందలి రాజులు పల్వురు శ్యామదేశమునకు విచ్చేసి వివాహమహోత్సవమునందుఁ బాల్గొనిరి. రుద్రదాముఁడు మాత్రము రాలేదు గాని యాశీస్సులఁ బంపెను. రుద్రాణి యీ వార్తవినెను. ఆమె ధాన్యకటకము నందే యుండెను. అక్కడ నీవార్త తెలిసినది. ఆమెను రమ్మని యాహ్వానము రాలేదు. శాతకర్ణియుఁ బ్రత్యేకముగాఁ దనకు వ్రాయలేదు. ఆమె మిన్నకుండెను. శ్యామదేశమున వివాహమహోత్సమునఁ బాల్గొనిన వారికెల్లరకు నా వధూవరులను జూడఁగా నొక విచిత్రమైన యనుభూతి కలిగెను. ఈ వధూవరుల దొక క్రొత్త పోకడ. వా రొకరికొకరు సన్నిహితులై వర్తింతురు. సర్వోత్సవముల యందును సమముగాఁ బాల్గొందురు. స్థూలదృష్టికి వారు వధూవరులే. కాని కొంచెము సూక్ష్మముగఁ బరిశీలించినచో వారియందు శరీరగతమైన కామమున్నట్లు కానిపించుటలేదు. శాతకర్ణి పరివారములో నొక వృద్ధపరిచారిక యున్నది. ఆమెపేరు తంగమణి. ఆమె యీ నూతనవధూవరుల పోకడలను సూక్ష్మముగఁ గనిపెట్టుచుండెను. వారిద్దరే కాసన శయ్యాదికము లనుభవించుచున్నే

యుండిరి. కాని పరిశీలింపగా నొకరిచే నొకరు పరిభుక్తులగు చున్నట్లు తోఁచలేదు. తంగమణి యీ వార్త రుద్రశ్రీ కందించినది. ఆయన యన్నాఁడు 'అవునే! మనరాజు దేవతా స్వరూపుఁడు. ఆయన ప్రాతిభాసిక స్వరూపముతో నామెతోఁ గ్రీడించుచున్నాఁడు. ఇది శరీరగతమైన దుష్టకామ సంబంధము కాదు.' తంగమణి తెల్లపోయినది. ఆమె పరిశోధన మానలేదు. ఒక నాఁడామె హఠాత్తుగ నాగవల్లి కాశాతకర్ణుల శయ్యాగారములోనికిఁ బోయినది. సాధారణముగనది శిరోమూల్యము గలిగిన యపరాధము. కాని తంగమణి నాలుగుతరములుగా నాంధ్రరాజ్ఞీవతంసముల సేవించుచున్న పరిచారిక. ఆమె సర్వనియమాతీతురాలు. అందుచేత రాజేమియు ననలేదు. ఆయన శాతకర్ణి యగుటయు గొంత కారణమై యది యపరాధముగఁ బరిగణింపఁబడలేదు. తంగమణి కంటఁబడిన సందర్భమిది.

కామము ఘోరాతిఘోరమైన మనోవృత్తి. అది వశిష్ఠ విశ్వామిత్రులను గూడ స్వాధీనము చేసికొన్న మహాశక్తి తన మనోవృత్తిలో యంతరాంతరముల నన్నింటిని గళామయ మొనర్చి సౌందర్యాస్వాదన పరాయణుండై వర్తించుచున్న శాతకర్ణి కొక క్షణకాల మొకానొక కామవాసనా ప్రేరితమైన మనోవృత్తి బాధించెను. నలుఁడు యావజ్జీవము సర్వకాల సర్వావస్థల యందు ధర్మాగ్నిహోత్రియై వర్తించుచుండెను. అతని ద్వేషించుచున్న కలి, నలుని ధర్మాగ్ని హోత్రమునకు జడిసి యతని యందుఁ బ్రవేశింపలేక పోయెను. తుదకొకనాఁటి యర్ధరాత్ర

మునఁ బాదశౌచము మఱచి నిద్రించిన నలునియందుఁ గలి ప్రవేశించెను. అట్లు శాతకర్ణియం దా కామవృత్తి ప్రవేశించెను. ప్రవేశమే ప్రబోధము. వల్మీకము వెలువడిన త్రాచు కస్సు మని లేచిన ట్లావృత్తి తత్కాలావేశమునందు రాజు నాగ వల్లికా శరీరము నంటెను. నాగవల్లిక మహాభాగ్యమని సర్వా త్మార్పణము సేయుటకు బదులుగాఁ గెవ్వుమని కేకవైచి మూర్ఛాగత యయ్యెను. రాజు నివ్వెఱ భజించెను. తత్కా లమునకు సమాసన్నయైన తంగమణి సాయముతో రాజు నాగ వల్లికను సేదదేర్చెను. నాటినుండి రాజునకు నాగవల్లికపైఁ గామవృత్తి కలుగలేదు. నాగవల్లిక త్రాచుపామువలె శాత కర్ణి శరీరమును జుట్టుకొనుట మానలేదు.

వివాహమహోత్సవము లన్నియుఁ బూర్తియైన తరు వాత నవదంపతు లిర్వురును ధాన్యకటకమునకుఁ బయనమైరి. రాజపరివారమంతయు నౌకలనెక్కి బయలుదేఱిరి. విజయతుం గుఁడు కూఁతు నల్లున కపారధనరాసుల నిచ్చి సాగనంపెను. మామగారును దక్కిన ద్వీపాధిపతులు నిచ్చిన కానుకలకై శాతకర్ణి రెండు నౌకలను వేఱుగ నద్దెకుఁ దీసికొని పోవలసి వచ్చెను. నౌకలు సురక్షితముగ మహీశూలపురేవు చేరినవి. శాతకర్ణి మహీశూలపు రేవునుండి ధాన్యకటకమునకుఁ జేరెను. అక్కడను రుద్రాణి యెదురు రాలేదు. ఆయన రాజప్రాసా దమునకుఁ బోయెను. అందును రుద్రాణి పొడ గానరాలేదు. రాజు రుద్రాణి యంతఃపురమునకుఁ బోయెను. పరిచారిక

లెల్లరును రాజునకు వైదొలఁగిపోయిరి కాని ప్రత్యుత్థానము చేసిన వారెవ్వరునులేరు, రాజెట్టకేలకు రుద్రాణి శయ్యాగారనకుఁ బోయెను. అక్కడను రాణి యాయనకుఁ బ్రత్యుత్థానము సేయలేదు. రాజు శయ్యపైఁ గూర్చుండెను. పరిచారికలు కొన్ని సముదాచారములు నడిపిరి. కాని రుద్రాణి పల్లెత్తి మాటాడలేదు. రాణి యేదో పరధ్యానమునందున్నట్లు కానవచ్చెను. రాజు నకది స్వభావమే నాయెను.

రాజు రుద్రాణి యంతఃపురమున గొంతసేపు గడపి వెనుదిరిగి పోయెను. పోవునప్పుడు పరిచారిక లాయన యనుభావమును సూక్ష్మముగఁ బరిశీలించి చూచిరి. ఆయన యందుఁ గోపములేదు. రోషము కానరాలేదు. దుఃఖపుఛాయ యైనలేదు. ఉన్నవాఁ డున్నట్లుగా వచ్చెను. ఉన్నవాఁ డున్నట్లుగాఁ బోయెను. అతనియందే మార్పును గానరాలేదు.

లోకమంతయు నభినయము. మన కామాదులు మన కోపతాపములు, మన బెదరింపులు, మన దుఃఖాదులు సర్వము నభినయము. ఈ యభినయము మనము కావలయునని చేయము. అది మనకు స్వభావసిద్ధముగా నున్నట్లు జరిగిపోవుచుండెను. ఒక బంధువు చనిపోవును. వాని బందుగులెల్లరు గావురుగీవురుమని దుఃఖింతురు. ఆ పోయిన బంధువు కర్మాంతరములలోనే మిగిలినవారు గొల్లుమని కలహింతురు. ఆ దుఃఖము, నీపోరాటము నివి యన్నియు నభినయములే. మనము దుఃఖిం

పక పోయిన లోక మేమనుకొనునో యని దుఃఖింతురు. మనము కోపింపక పోయిన లోక మేమనునో యని కొందరు కోపింతురు. ఫలితార్థ మేమనగాఁ గామరోషాదు లారోపితములు గాని జీవ సహజలక్షణములు కావు. రుద్రాణికిఁ గోపము వచ్చెను. తన మగఁడు తనకుఁ గాకుండఁ బోయెనని యామె రోషపడెను. ఇది రాజులకు ధర్మమే కదా! రాజులు రత్నాపహారులు. బహుభార్యాత్వము రాజులయందు నిషిద్ధముకాదు. ఆయన తన్నుఁ బరిత్యజింపలేదు. తన పట్టమహిషీత్వమును నిషేధింప లేదు. పాపము, తాను పేక్ష వహించినను రెండుమూఁడు మారులు తన యంతఃపురమునకు వచ్చిపోయినాఁడు. ఇది యేమి చిత్రము! ఈ రాజు పుంస్త్వహీనుఁడు కాదే! తనపైఁ గోపించఁడేమి? తన్ననునయింపఁ జూడఁడేమి? తటస్థుఁ డైనచోఁ దనపై వలపులేనిచో నిక్కడికి వచ్చుటెందులకు? తన కాయనపైఁ గోపము వచ్చినదా? వచ్చినది. వచ్చినచోఁ దాను ధాన్యకటకమునం దెందులకున్నది? ఇక్కడ నుండక మఱి యెక్కడ నుండవలయును? ఉజ్జయినికిఁ బోవలయునా? పోయి తానేమి చేయును?

తంగమణి వచ్చెను. రాజునకు నాగవల్లికకు గల విచిత్ర సంబంధమును జెప్పెను. రుద్రాణి నమ్మలేదు. ఆమె హృదయ మున విశ్వాసము జనింపలేదు. 'పొలఁతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు.' లోకములో స్త్రీ పుంతత్త్వములు సంయో గము నొందుటకే సృష్టింపబడినవి. శాతకర్ణి నపుంసకుఁడు

కాఁడు. ఆతఁడు పుంస్త్వాభరణుఁడని ప్రసిద్ధిఁ గన్నవాఁడు. నాగవల్లిక వట్టి తృతీయాప్రకృతి కావచ్చును. ఇట్టి పెగ్గడి క్షత్రియలను మున్ను రుద్రాణి యెఱుఁగును. లోకములో నట్టి విపరీత ప్రకృతులుండును. అది సృష్టి కళిదేశము. మఱి రాజున కామెతో నేమి సుఖపడుచున్నట్లు, ఆలోచించిన కొలఁది రుద్రాణి కసహ్యము తోఁచెను. ఛీ! లోకములో నెన్ని తుచ్ఛ ప్రకృతులులేవు. అందు వీరిరువురు నొక విశేషము.

భదంతశ్రేష్ఠి వచ్చెను. ఆయన యాంధ్రరాజధానికి వచ్చుట కిదియే తొలిసారి. రుద్రాణి యంతఃపురము వెదకికొని వచ్చెను. సముదాచారములయిన తరువాత భదంతుఁ డిట్లని యెను. 'అమ్మా! తమ పదివేల దీనారములు నానాఁడే పంపి రేమి?'

'ఏ నాఁడే?'

'తమ యోడ యింకను రేవులోనే యున్నది. నాడబ్బు నాకుఁ దిరిగి వచ్చినది.'

'ఆఁ?

'నిజమే తల్లీ! ఆనాఁడే తిరిగి వచ్చినది. ఆ సంచిపై నాంధ్ర చక్రవర్తుల లక్కముద్రయు నున్నది.'

రుద్రాణి కొంచెము చకిత యయ్యెను. ఆనాఁడు శాత కర్ణి యోడ యొద్దకు వచ్చెను. తానాయనను బలుకరింపలేదు. ఆయన యంతట నాయనయే తన ప్రయాణసౌకర్యము

లన్నియు సరిగానేయున్నట్లు చూచుకొని వెడలిపోయెను. ఈ ధనము నాయనయే పంపియుండవలయును. ఈ రాజు తత్వ మేమి ? ఇది యున్మాదమా ? ప్రణయమా ? మఱి యేమి ?

భదంతు డిట్లు వ్యాఖ్యానించెను. 'చక్రవర్తులు నాగ లోకములందుఁ దిరుగుచున్నారు. వారిప్పుడు మీకు లక్ష్యులు కారనుకొందును.'

రుద్రాణి భదంతుని వంకఁ జూచెను. ఆతని ముఖమున ననిష్టమైన ఛాయ గోచరింపలేదు.

'అలక్ష్యు లనఁగానేమి ?'

'తమరు పట్టమహిషులు. ఆమె భోగిని. భోగమూ మెది. పదవి మీది.'

రుద్రాణి తల యూచెను. భదంతుఁ 'డాజ్ఞయైనచో దండ్రిగారితో మనవి చేసెదను. నే నీనాఁడే యుజ్జయినికిఁ బోవుచుంటి' ననెను. రుద్రాణి దీనికిని శిరఃకంపను మాత్రమే చేసెను. భదంతుఁడు వెడలిపోయెను.

## ౬

శాతకర్ణి నాగవల్లికిఁ గ్రొత్త ప్రాసాదమును గట్టించెను. అది యతిలోక రమణీయమై యుండెను. ప్రాసాద మంతయుఁ జంద్రకాంత శిలలతోఁ గట్టిరి. ఏడంతస్తులు. పైని జంద్రశాల. ప్రాసాదము పై భాగముననే యుద్యానము నెలకొల్పిరి. అంతయుఁ జూచుటకు మయసభవలె సంసిద్ధపఱుపఁ బడెను. ప్రాసాదము చుట్టును మహోద్యానము. దానిని జుట్టి ప్రాకారము. ఆ ప్రాకారము కృష్ణానది నంటి యొక క్రోసెఁడు దూరము కలదు. ఆ ప్రాసాదము ధాన్యకటకములో దర్శనీయ స్థల మయ్యెను. రాజధానికి వచ్చిన సర్వదేశములవారు నా ప్రాసాదమును జూడకుండఁ బోవుటలేదు. ఇంత యున్నతము నింత రమణీయమైన ప్రాసాదమునందు నివసించు రాణి యెంత మహనీయురాలో సర్వరాజ స్త్రీలును నాగవల్లికా దర్శనార్థ మరుదెంచుచుండిరి. నాగవల్లిక సరస్వతి. చతుష్షష్టి కళలు నామె జిహ్వాగ్రమునఁ గ్రొత్త తీర్పులు తీర్చినవి. భారతరాజన్య పట్టమహిషులలో నింత విద్యావతి, యింత భోగవతి, యింత యదృష్టవతి మఱి యెక్కడను గనరాదను యశస్సు దిగ్దిగంతముల మాఱుమ్రోగినది. ఈ మ్రోఁత రుద్రాణ్యాతఃపురమున గింగురు మని మాఱుమ్రోఁత లీనినది. రుద్రాణి రుద్రాణి యయ్యెను. ఈర్ష్యాక్రోధములు పెచ్చుపెరిగిపోయెను. దీనికిఁ బ్రతీకార మేమి ? నాగవల్లికను జంపించినచో ? అది

సాధ్యమా ? రాజు ప్రాకార రూపమున జుట్టి యామెను సంరక్షించుచున్నాఁడు. రాజు రాజుగా నున్నాఁడా ? ఆయన మునుపటితీరు కాదు. ఎవ్వరు కొట్టినను దిట్టినను మాఱుసేయు నట్లు లేదు. ఛీఛీ, వీరితోడి దేమి యని రుద్రాణి ఛీదరించుకొనెను. శాతకర్ణి నాగవల్లికా ప్రాసాదమున గృహప్రవేశ మహోత్సవ మని ప్రకటించెను. రాజులు, రాజబంధువులు, మిత్రులు, దూర దూరదేశములవారు సర్వులకు నాహ్వానములు వెళ్ళినవి. గృహప్రవేశ మహోత్సవమునాడు రాజును నాగవల్లికయుఁ బీటలమీఁదఁ గూర్చుండిరి. అందఱు వచ్చిరి. దంపతుల నాశీర్వదించిరి. కట్నాలు కానుకలు సమర్పించిరి. మహానంద వార్నిధి పొంగినట్లయ్యెను. నాగవల్లికా శాతకర్ణులు శచీపురందరులవలె బ్రకాశించిరి. ధాన్యకటకము పూలతోట యయ్యెను. సర్వగృహములు నలంకరించిరి. రాత్రులందు దీపకాంతులు ప్రకాశించి జ్యోత్స్నా కాంతులు వెదజల్లెను. రాజు పది దినములు వరుసగా నుత్సవములు జరిపించెను. పండిత పరిషత్తులు గానసభలు, కవిసమ్మేళనములు, శాస్త్రగోష్ఠులు, వేదసభలు, చతుష్షష్ఠి కళాప్రదర్శనములు, విందులు, వేడుకలు పుష్కలముగ జరిగిపోయెను. ధాన్యకటకవాసు లెల్లరకు నా పది దినములు నిత్యోత్సవము లయ్యెను. ఆ పది దినములు నొక్క రుద్రాణీ యంతఃపురము మాత్రము మూఁతవేసి నట్లుండెను. నగర మెల్ల జ్యోత్స్నామయము. రుద్రాణి యంతఃపుర మంధకార బంధురము. నగరమెల్లఁ గోలాహాలాపూరితము. రుద్రాణీ

యంతఃపురము నిర్మానుష్యము. నగరమెల్ల మంగళతోరణాలంకృతము. రుద్రాణీ యంతఃపురము నిష్ప్రచ్చరము.

ధాన్యకటకవాసులు పదునొకండవ దినమునఁ గన్నుచెఱచిరి రుద్రాణి పట్టమహిషి, ధాన్యకటకమును వదలిపోయినది. రాజుతోఁ జెప్పలేదు. మహామాత్యునికి గబురు పంపలేదు. దండనాయకునకుఁ బిలుపు రాలేదు. నగర మంతయు నాగుబ్బుగాఁ జెప్పికొనిరి. ఏమి మూఁడ నున్నదో యని కొందఱు భయపడిరి. రుద్రదాముఁ డూరకొనఁ డని కొందఱు పెదవి విఱచిరి. రుద్రదాముఁడు బలవంతుఁడు. దండు వెడలి సామ్రాజ్యమును సగము పంచుకొను నని కొందఱు తర్కించిరి.

మహామాత్య విష్ణుశ్రీదత్తుఁడును, మహాదండనాథ రుద్రశ్రీయును గూడ నొక విధముగా నిర్విణ్ణులైరి. సర్వతశ్చక్షువైన మహామాత్యుఁ డిట్టి దేదో సంభవించు నని యనుకొనుచుండెనే కాని సరిగా నిదియే జరుగునని యెంచలేదు. అమాత్య దండనాయకు లిర్వురు రాజును జూడఁబోయిరి. రాజు రహస్యాలోచన సభకు వచ్చెను. 'పట్టమహిషి రాజధానిని వదలిపోవుట సామ్రాజ్యమునకు శుభసూచకము కాదు. ఆమె యిప్పుడు ప్రతిష్ఠానమును దాటియుండదు. సెలవైనచో నామె మార్గము నరికట్టుటకు సిద్ధముగా నుంటి' నని దండనాథుఁడు విన్నవించెను.

'ఆమె యుజ్జయినికిఁ జేరినచో సామ్రాజ్యమునకు ముప్పు వాటిల్లకపోవచ్చును గాని యిది యుద్ధమునకు, వైరమునకు బీజ మగుట తప్పదు. సామముచేత నామెను ద్రిప్పి తీసికొని వచ్చుట నీతి' యని మహామాత్యుఁడు సెలవిచ్చెను. రాజి ట్లనెను. "రాజనీతి కేవల శారీరకమైనచో నికృష్టమయిపోవును. నేను రాజ నన్నచో నా సామ్రాజ్యము యొక్క యాంతర బాహికములైన యోగక్షేమము లన్నియు నాయందే నిహిత ములై యున్నవి. ప్రస్తుత సందర్భమునకు రాజనీతికిఁ జాల దూరమైన సంబంధము కలిగినమాట నిజమే. ఎంత చక్రవర్తి దంపతుల దైనను నీ విషయము భార్యాభర్తలకు సంబంధించి నది. వారు సమ్రాట్టులైనంతమాత్రమున స్త్రీపురుష సంబం ధము దీనియందు లేకపోదు. నే నీ విషయమును బ్రణయినీ ప్రణయుల కలహముగా భావించుచున్నాను. రుద్రాణి ఖండిత. ఆమె ననునయించుట నా విధి. అది నాకు వదలివేయుఁడు. నే నామెను బరిపక్వమైనకాలమున ననునయింతును."

విష్ణుశ్రీదత్త రుద్రశ్రీలు రాజున కెదురాడలేకపోయిరి. సభ యానాటికిఁ జాలింపఁబడెను. దీనివలన సామ్రాజ్యమునకు వచ్చు ముప్పు రాజున కవగతము కాలేదుగదా యని విష్ణుశ్రీ దత్తుఁడు విచారించెను. రుద్రదాముఁడు రాజ్యకాంక్షాపరుఁడు. మొన్న భదంతుఁడు వచ్చి రుద్రాణితో మాటలాడిపోయినాఁడు. వాఁడు తిమ్మిని బ్రహ్మిని-బ్రహ్మిని దిమ్మిని జేయఁగల్గిన యఘ టన ఘటనా ధురంధరుఁడు. భదంతుని రాకకు రుద్రాణి

పోషకులకుఁ గార్యకారణ సంబంధ మున్నట్లు కనబడుచున్నది. ఈ యగ్నిత్రయ ముజ్జయినిలో సమావేశ మగుదురు. ఆంధ్ర సామ్రాజ్యమునకు భదంతుఁడు వైరి. ఒక్క యాంధ్రులు మాత్రమే వాని కే విధముగను నప్పువడిలేరు. తక్కిన రాజు లెల్ల వావి కర్దదాసులై యున్నారు. తన విధిని దాను నెఱ వేర్వవలసి యుండునని విష్ణుశ్రీదత్తుఁడు వెంటనే యుత్తర దిశ నున్న దుర్గపాలకులకు హెచ్చరిక చేయుచు జాబులు వ్రాయిం చెను. అవసరపడినచో రాజధానీ రక్షణమునకు దండులు పంప వలసియుండు నని సామంతులకెల్ల నాజ్ఞాపత్రములు పంపించెను. కోట గవనులు, ప్రాకారము, కొమ్మలు, దిడ్డులు బాగుచేయించి సమర సన్నాహము లన్నియుఁ జేసెను. శాతకర్ణి వృద్ధా మాత్యుఁడు చేయుచున్న యేర్పాటులన్నిటిని జూచి లోలోపల నవ్వుకొనెను. ఈ మానవులు శరీరగతమైన బుద్ధిగలవారు. వీ రెవ్వరికి నాత్మజిజ్ఞాస లేదు. తాము జీవాత్మల మను పరిజ్ఞాన మున్నచోఁ బ్రపంచమున నింత యలజడి లేదు. జీవాత్మ యేదుపంది వంటిది. ఏఁదుపందికి ముండ్లకవచ మున్నది. జీవా త్మకు మనఃకవచ మున్నది. ముండ్లు ముడుచుకొన్నప్పు డేదు చిన్న పందికొక్కువలె నుండును. ముండ్లు విప్పుకొన్నచో నది గ్రామసూకరమంత యగును. అట్లే మనఃకవచము పెరిగినచో జీవాత్మ సూకరప్రమాణము కలది యగును. ఈ మనఃకవచము యొక్క కప్పు విప్పుతే ప్రపంచ స్వరూపము. రుద్రాణికిఁ దన తత్త్వము తెలియదు. తాను జీవాత్మ పరమాత్మల యైక్య

మును జూచును. అసంస్కృతబుద్ధియు రాజవంశాహంకార పరీతయు నైన రుద్రాణికిఁ దాను జీవాత్మనని పురుషునిలోని పరమాత్మాంశతోఁ దాను లయింపవలయు నను జ్ఞానములేదు. కానిమ్ము. తాను రుద్రాణీ భర్త. భర్త యనఁగా భార్య యొక్క యైహికాముష్మికములైన భారముల వహించువాఁడు. తాను నాగవల్లిక సాధనముగా నభ్యసించుచున్న యాత్మ లయ యోగమున కిది ప్రతిబంధకముగా రూపొందినది. అయినను నీ లయయోగము రుద్రాణియందు గూడఁ బ్రతిపాదించుట తన విధి. రుద్రాణిని భవానిని జేయవలయును. పరమశివాకృతి దాల్చి చిన్మయాకారనుగాఁ జేయవలయును. ఈ విధి సామ్రాజ్య పాలనముకంటె, నాత్మ సాక్షాత్కారముకంటెఁ గూడ మహత్తరమైనది. దీనియందు నా రాజరికమునకు, నా చక్రవర్తిత్వమునకు నపప్రథ కలుగవచ్చును. ఎంత గొప్ప కులమునఁ బుట్టినను నెంత లౌకికానందము ననుభవించినను బాహ్యిపంచిక విషయలోలులగువారికిఁ జిన్మయానందముకలుగదు. రుద్రాణి సర్వతోముఖమైన యహంతతోఁ బ్రాకులాడు చున్నది.” ఇట్లు భావించుచున్న శాతకర్ణి చెవులకు నాగవల్లికా పాదమంజీరముల రవళి విననయ్యెను. రాజు తల యెత్తి చూచెను. నాగవల్లిక సమీపించి యుపగుప్తాచార్యులవారు వచ్చినా రని చెప్పెను. దంపతు లిర్వురు నుపగుప్తాచార్యులవారి

దర్శనమునకు వెళ్ళిరి. ఉపగుప్తాచార్యులు బౌద్ధమత గురువు. ఆయన యమరావతీ విహారమునం దాచార్యపీఠమునం దున్నవాఁడు. రాజదంపతుల నాయన దీవించి నాగవల్లికతో 'బిడ్డా! నీవు బుద్ధ ప్రసాదము నందుట యెప్పు' డని ప్రశ్నించెను. నాగవల్లిక రాజువంకఁ జూచెను. రాజు 'భగవన్, బుద్ధ ప్రసాదము నందుటేమి' యనెను. గురువు 'రాజచంద్రమా! నీ దేవేరి బౌద్ధ శ్రమణీకాదీక్ష పొందునఁట' యనెను. రాజు నాగవల్లిక వంకఁ దేటిపాటుఁ జూచెను.

౭

ఉజ్జయినిలో రాచనగరునందు భదంత రుద్రదాములు సంభాషించు చుండిరి. రుద్రాణి కూడ వారి పజ్జనే యుండెను. రుద్రదాముఁడు భదంతునితో 'ఏమయ్యా! భదంతా! శాతకర్ణి మనల నిట్లు తృణీకరించుట రాజనీతి యనుకొన్నాఁడా' యని ప్రశ్నించెను.

భద:- చిత్తము.

రుద్రాణీ:- ఆయన కొకసారి యుజ్జయినీ మాహాత్మ్య మెఱుకపఱచినగాని యీ నిద్ర మేలుకోఁడు.

రుద్రదాముఁడు:- మన మహిమ యాయన కెట్లు తెలియును ?

భదంతుఁడు:- మహామాత్యులను గూడఁ బిలిపించి యాలోచించిన మంచిది.

మహామాత్యుఁడైన యజ్ఞదత్తుఁడు ప్రభ్వాజ్ఞచే రావింపఁబడెను.

రుద్రదాముఁడు:- మన బల మెట్లున్నది ?

యజ్ఞదత్తుఁడు:- మన బలమున కేమి ? నిక్షేపముగా నున్నది. కాని మన బలము శత్రువునుబట్టి నిర్ణయింపవలయును.

రుద్రదాముఁడు:- మన మాంధ్రసామ్రాజ్యముపై నెత్తి పోఁగలమా ?

యజ్ఞదత్తుఁడు:-ఆంధ్రసామ్రాజ్య బలము ప్రస్తుత మక్షీణ ముగా నున్నది. వారి యుత్తరదిశ కోట లన్నియు సమస్త సంభారయుతములై వీరభట రక్షితములై శత్రువులకు దుర్భేద్య ములుగా నున్నవి.

రుద్రదాముఁడు:- అకాలమున వారి కింత సంరంభ మెందులకు ?

యజ్ఞదత్తుఁడు:- అకాల మేమి ప్రభూ ! పట్టమహిషి తిరుగుబాటుచేసి రాజధాని వదలివచ్చినదాయెను. ఆమె యేమి చేయునో !

రుద్రదాముఁడు:- సంతాన విహీనుఁడైన శాతకర్ణి రాజ్యములో సగము రుద్రాణికి వచ్చునుగదా !

యజ్ఞదత్తుఁడు:- ఆంధ్రులు స్త్రీకి సగము భాగ మిచ్చుట వారి సంప్రదాయము కాదు.

రుద్రదాముఁడు:-అది నేను ఖడ్గాగ్రమున సంపాదించెదను.

యజ్ఞదత్తుఁడు:- ఎదుటి బల మజేయముగా నున్నది. మన బలము నిస్సారముగా నున్నది.

రుద్రదాముఁడు:- కారణ మేమి ?

యజ్ఞదత్తుఁడు:- మరుస్వభ్ర దేశము లీ సంవత్సరము పండ లేదు. ప్రజలు తిండిలేక క్షామపీడితులై యున్నారు. బొక్కస ములో ధనము లేదు.

రుద్రదాముఁడు:- భదంతుఁ డున్నాఁడు. మన కపార మైన ధనము పెట్టుబడి పెట్టుట కాతనికి సామర్ధ్యము కలదు.

యజ్ఞ:- అప్పుచేసి బలమైన శత్రువుతో డీకొనుట రాజ నీతి కాదు. అదియునుగాక రుద్రాణీదేవి కొంచెము తొందర పడిరని చెప్పిన నన్ను క్షమింపవలయును. ఈ వ్యవహారము సామమున దీర్పఁ దగియున్నది. బలవంతుఁడైన బంధువు నకారణముగ రెచ్చగొట్టుట ధర్మముకాదు.

రుద్ర;- ఆ సామ మెట్టిది ?

యజ్ఞ:- అది యమ్మాయిగారి చేతిలో నుండును.

రుద్రాణి:- నన్ను మఱల రాజధానికిఁ బొమ్మందురా?

యజ్ఞ:- అది కాదు. శాతకర్ణి చక్రవర్తులనే యిక్కడికి రప్పింపవచ్చును.

రుద్రాణి:- అది యసాధ్యము.

యజ్ఞదత్తుఁడు·- ఆ విషయము నాకు వదలిపెట్టుఁడు.

భదంతుఁడు:- మీ యూహ యేమి ?

యజ్ఞదత్తుఁడు:- ఆంధ్ర సామ్రాజ్యపు సరిహద్దు నర్మదా నదివఱకు నున్నది. సరిహద్దంతయు దుర్భేద్యముగానే యున్నది గాని యపరాంతము దక్షిణ భాగము కొంత దుర్బలముగా నున్నది. అపరాంతవాసు లాంధ్రులకుఁ బ్రియులుకారు. అప రాంతమునకు దాపులో నజాంత పర్వతము లున్నవి. అక్కడి బౌద్ధ విహారమునకు శాతకర్ణి కతిపయపరివారముతో నిరాడంబ రముగ వచ్చి దర్శనము చేసికొని పోవుచుండును. . అప్పు డాయనను దేలికగా బంధించి తీసికొనిరావచ్చును.

భదంతుఁడు:- రాజును బంధించినచో నాంధ్ర సైన్య సాగరము సంక్షోభించి దేశమును ముంచివేయదా ?

యజ్ఞదత్తుఁడు:- రాజు మనకు స్వాధీనుఁడై యుండును. ఆయన మాటయే యాంధ్ర సైన్యసాగరమునకుఁ జెలియలికట్ట యగును.

భదంతుఁడు:- అమాత్యవర్యా ! మీ వ్యూహము మనో హరముగనే యున్నది గాని కార్యకారిగాఁ దోఁచుట లేదు. దానివలన మన కేమి ప్రయోజనము ?

యజ్ఞదత్తుఁడు:-కూతు నల్లుఁడు సుఖముగా నుండుటయే యుజ్జయినీపతి యాశయము.

సభ యానాటికిఁ జాలించిరి. భదంతుఁడు సంతృప్తిపడ లేదు. ఆతనికి రుద్రదాముఁ డాంధ్రులపై దండెత్తి వారి పొగ రడఁచవలయు నని యున్నది. రుద్రదామునకు బలవద్వైర మకారణముగఁ దెచ్చికొనుట మంచిదికాదని యున్నను దన పరాక్రమ విశేషమును ప్రపంచమునకుఁ బ్రదర్శింపవలయునను కుతూహలము కలదు. తాను గొప్ప దండనాథుఁడు. శాతకర్ణి గొప్ప ధీరోదాత్తుఁడైన చక్రవర్తి. అల్లుని చక్రవర్తిత్వమునఁ దాను దండనాయకుఁడైన భారతదేశము నేలవలయునను కాంక్ష రుద్రదామున కున్నది. కాని ప్రస్తుతమునకు యజ్ఞ దత్తుని యూహయే బాగుగా నున్నట్లు తోఁచెను. శాతకర్ణి

యుజ్జయినిలోఁ గొన్నాళ్ళున్నచో మనస్సు మార్చుకొన వచ్చును. ఆతనిని నయభయముల స్వాధీనముచేసికొని కార్యమును సాధించుకొనుట మంచిది. రుద్రాణి కాపురము కుదుటఁబడుట సామముచేతనే బాగుగ నుండునని తలచెను. రుద్రాణికి నిజముగా నేమి చేయవలయునో తెలియుటలేదు. అసలామె యుజ్జయిని కేల వచ్చెనో గూడ దెలియని స్థితిలోఁ బడిపోయెను. తన తండ్రి కపారమైన బలసంపత్తి కలదని యామె యెంచెను. కాని యది యసత్య మని తేలిపోయినది. శాతకర్ణిని స్వాధీనము చేసికొనుట బలప్రదర్శనమువల్లఁ గాదని ఋజువైనది. ఇక సామము, కుత్సితోపాయములు మిగిలి యున్నవి. వీనివలన శాతకర్ణి యెంతవఱకు మారునో తెలియదు. అంతయు నయోమయముగానే యున్నది. రుద్రాణి కాలమను సముద్రముపై బ్రియాణించు బేహారివలె నైనది. తనకు శాతకర్ణికి నీ విరోధ మెందులకు ? తాను రాజధానిని విడిచి యెందులకు వచ్చినది ? వచ్చి సాధించిన దేమి ? ఈ విధమగు నాలోచనలతో నొక వారము దినములు గడచినవి.

యజ్ఞదత్తుఁ డొక యెత్తు వేసెను. శాతకర్ణి నుజ్జయినికి దీసికొనిరావలయును. అజాంతవిహారమునఁ గార్తికమాసమునఁ గృత్తికోత్సవములు జరుగును. ఆ యుత్సవములకు దేశములోని బౌద్ధపీఠాధిపతు లెల్లరును వత్తురు. ఆ నాళ్ళలో శాతకర్ణి యుత్సవదర్శనార్థియై వచ్చును. అప్పు డాయనను బౌద్ధశ్రమణక

వేషములందున్న తన భటులు పట్టుకొని నర్మద దాటింతురు. నర్మద దాటిన తరువాత సర్వమును సక్రమముగ జరుగును.

ఈ వ్యూహముతో నతఁడు వేయిమంది బౌద్ధశ్రమణకులను సంసిద్ధము చేసెను. అజాంత విహారము నుండి యుజ్జయిని వఱకు నంచె లేర్పఱచెను. గాలితో సమానముగఁబోవు నశ్వ శకటముల సిద్ధపఱచెను. అజాంతవిహారము నుండి సూర్యాస్త మానము లోపల నుజ్జయినికి రావలయును. ఈలోపల నాంధ్ర సేనానుల కీ వార్త కూడఁ దెలియరాదు. యజ్ఞదత్తుఁడు తన రహస్యము నరునకు నారాయణునకుఁ దెలియకుండఁ గాపాడెను. యజ్ఞదత్తుఁడు రుద్రాణి యొద్దకుఁ బోయెను.

యజ్ఞదత్తుఁడు:- తల్లీ ! సర్వము సంసిద్ధమైనది. ఱేపు కార్తిక పూర్ణిమనాడు కృత్తికోత్సవము కదా ! ఆనాఁడు రాత్రి పంద్రెండు గడియలు దాటిన తరువాత శాతకర్ణి చక్రవర్తిని జీవగ్రాహముగాఁ బట్టుకొందుము. పాడ్యమినాడు సాయంకాలమునకు వారి నిక్కడకుఁ దీసికొనివచ్చు నేర్పాటు చేసితిమి.

రుద్రాణి:- ఆంధ్రులు నిద్రపోవుచుందురా ? వారు జాగరూకులై మీ వ్యూహమును ఛేదించినచో !

యజ్ఞ:- తల్లీ ! మన ముపాయ స్వరూపులము, ఉపేయ స్వరూపము దైవము.

రుద్రాణి:- చక్రవర్తిని దెచ్చి యేమి చేయుదురు ?

యజ్ఞ:- మీకు స్వాధీనము చేయుదుము.

రుద్రాణి:- నే నేమి చేయవలయును ?

యజ్ఞదత్తుఁడు నవ్వెను. 'తల్లీ ! శివశ్చక్తా యుక్తో యది శక్తః ప్రభవితుం' జగత్తంతయు శక్తియందు నివిష్టమై యున్నది. మీరు తలఁచుకొన్నచోఁ గానిపని యున్నదా ?"

రుద్రాణి యాలోచనాపథమునఁ బడిపోయెను. యజ్ఞదత్తుఁడు సెలవు తీసికొనిపోఁగా భదంతుఁడు వచ్చి రుద్రాణిని దర్శించెను. 'అమ్మా ! మీరు నిరుత్సాహపడకుఁడు. భారత దేశమునఁగల సర్వరాజ్యములను గొనివేయఁగలిగిన ధనసంపద నా కడ నున్నది. లక్ష్మికి సాధ్యముకాని పనిలేదు. ఈ కుయుక్తులతో నాంధ్రచక్రవర్తి స్వాధీనుఁ డగునా ? విష్ణుశ్రీదత్తుఁడు భూమికి నాకాశమునకుఁ దాళము వేయగలవాఁడు. ఎత్తుకుఁ బై యెత్తు వేయుటలో నాతనికి మించినవా రీ దేశమున లేరు. దండోపాయము దక్క దీనికిఁ బ్రతిక్రియలేదు. మీ రంగీకరించిన నేను సర్వము నిర్వహింతు'నని నెను. రుద్రాణి తలయూచెను.

## ౮

విష్ణు శ్రీదత్తునకు వేగు వచ్చెను. ఒక బౌద్ధశ్రమణకుఁడు వచ్చి యిట్లు విన్నవించెను. 'స్వామీ! మేము వేయిమందిమి. కృత్తికోత్సవము నాటి రాత్రి పంద్రెండు గడియలు దాటిన తరువాత నజాంతవిహారమున శాతకర్ణి చక్రవర్తులను బంధించి కొని పోవుదుము. కొనిపోయి యాంధ్రచక్రవర్తిని రుద్రాణీ చేసి కొప్పగింతము. తమరి చిత్త' మని వేగు చెప్పెను. విష్ణు శ్రీదత్తుఁడు మనసులో నవ్వుకొని యా వేగులవానికిఁ బసదన మిచ్చి పంపివేసెను.

కృత్తికోత్సవమునకు శాతకర్ణి బయలుదేరెను. రాజు మూామూాలు వేషముతోడనే యుండెను. నాగవల్లిక శ్రమణికా నేపథ్యము ధరించెను. నాగవల్లిక బౌద్ధదీక్ష పొంది యప్పటికి నెలదినములైనది. ఆమె నాగప్రాసాదమున నీ నెలదినముల నుండియు బౌద్ధశ్రమణకులకు విందులు జరుగుచుండెను. నాగ ప్రాసాదము బౌద్ధవిహారమై పోయెను. రాజిప్పుడు నాగవల్లిక యంతఃపురమునకుఁ బోవుటకు వీలులేదు. బౌద్ధగురువు లొనర్చు ధర్మప్రవచనములకు మాత్రము వెళ్ళుచుండెను. కాని నాగ ప్రాసాదమున జరుగు సర్వకార్యములును రాజాజ్ఞపైనే జరిగి పోవుచుండెను. నాగవల్లిక శ్రమణిక యైనది. ఇది యొక క్రొత్త వింత. ఆసులోని కండెవలె వచ్చి యనవసరముగాఁ జల్లఁగా జరుగుచున్న దాంపత్యమును జెడఁగొట్టి యిప్పుడు

శౌద్ధశ్రీమణికా వేషమును గట్టినంత మాత్రమునఁ బ్రయోజన మేమియని కొందరు దూయబట్టక పోలేదు. ఆమె యుద్దేశ మేమో యెవరికిని దెలియదు. రాజునకు నామెకు గల మచ్చిక యేమాత్రమును దగ్గినట్లులేదు. నాగవల్లిక యిదివఱకు ననవరతము రాజువంకఁ జూచుచుండెను. ఇప్పు డనవరతము తన యందే తాను నిమగ్నురాలై యున్నట్లు తోఁచుచున్నది. రాజు నేను గృత్తికోత్సవమునకుఁ బోవుచుంటి ననెను. నాగ వల్లిక నేనును బోవుచుంటి ననెను. రాజు నవ్వెను. నాగవల్లిక శాంతముగఁజూచెను. రాజానంద పడెను. నాగవల్లిక యందలి జీవత్వము పోయినది. ఆమె యాత్మస్వరూపమున భాసించు చున్నదని రాజు సంతృప్తిపడెను. చతుష్షష్టి కళానీతమైన భావ స్పందనమెల్ల నడఁగిపోగా భావాతీతమైన పరమశాంతి ఫలించును. కళాతపస్సు జరిగినంతవరకు సర్వభావములు నదుల వలెఁ బుట్టి నానాముఖములఁ బ్రవహించుచుండెను. పర్వతము వాగులకుఁ దండ్రి. ఆ వాగులు నానాముఖములఁ బ్రవహిం చును. కళాతపస్వి పర్వతము వంటివాఁడు. యోగి సముద్ర స్థానీయుఁడు. సర్వభావములు నతని యందు సముద్రమునందు వలె లయము నొందుచుండును. నాగవల్లిక యీ సముద్ర స్థితికి వచ్చినది. శాతకర్ణికిఁ దన భర్తృత్వము నచ్చినది. తన జీవితలక్ష్యము సగము సమకూడినట్లయిన దాయన మనస్సునకు. కాని యీ సంబంధము లోకుల దృష్టిలో మఖలోఁ బుట్టి పుబ్బలో మాడినదైనది. నాగవల్లికిఁ దనకు లోకులదృష్టిలో

నీఁక సంబంధము లేదు. కాని విదేహ ముక్తి పర్యంతము నీ యాత్మలు రెండును నిట్లు జంటబాయక యుండును. ఇంత స్వల్ప కాలమున నింత మహోద్భుత సన్నివేశము తమ యిరువురి దాంపత్యమునందు సంభవించుటకు రాజబ్బురపడెను. నాగవల్లిక యింత త్వరలో బౌద్ధదీక్షఁ బుచ్చుకొనునని రాజునకును దెలియదు. కాని యిది యిట్లు జరుగుట యాతనికిఁ బరమ వాంఛనీయమై వెలసెను. ఇఁక రుద్రాణి యున్నది. రుద్రాణికిఁ బూర్వవాసనాభరము బలీయమై యున్నది. తన కడుపు పండ లేదు. ఆత్మజిజ్ఞాసువు లైనవారికిఁ గడుపు ఫలించదు. రుద్రాణి యాత్మ జిజ్ఞాసు వే. కాని యది విపరీత మార్గమును బట్టినది. ఆమె పరిణామమార్గము కొంచము క్లిష్టతరమై యుండును. తాను జీవించి యున్నన్నినాళ్ళు నామెను సన్మార్గమునఁ బెట్టుట తన విధి. ఫలితము దైవాధీనము. ఇట్లాలోచనాధీన మానసుఁడై యున్న రాజునొద్దకు మహాదండనాథ రుద్రశ్రీ వచ్చెను. రాజేమి విశేషములని యడిగెను. 'ప్రభూ ! కృత్తి కోత్సవ ప్రయాణమున కన్నియు సిద్ధమైనవి. తాము సంసిద్ధు లగుటయే తరవాయి. రాణివాసమునకు బండ్లు, పల్లకీలు సిద్ధ మైనవి. మహామాత్యు లీ లేఖను దమ కర్పింపు మన్నా' రని రాజుచేతి కొక లేఖ నిచ్చెను. రాజా లేఖను జదువుకొని చిఱు నవ్వుతో దానిని మఱల దండనాథున కందించెను.

మఱునాడు రాజు, నాగవల్లిక కృత్తికోత్సవమునకు బయలుదేరి వెళ్ళిరి. ముందుగ రాజరథము సాగెను. వెనుక

నాగవల్లిక పల్లకిపైఁ బోవుచుండెను. ముందువెనుకల రాజపరివారముండెను. పరివారమునకు నాయకుడై రుద్రశ్రీ వచ్చుచుండెను. రాజపరివార మజాంత పర్వతము చేరిరి. పదిలక్షల మంది బౌద్ధశ్రమణకు లుత్సవదిదృక్షుతో వచ్చిరి. ఉత్సవ మద్భుతముగ జరిగెను. బౌద్ధగురువులు ధర్మోపన్యాసము లొనర్చిరి. నాగవల్లికాశాతకర్ణులు సర్వత్ర తామేయై యుత్సవకార్యములు సర్వము నిర్వహించిరి. రాత్రి రెండు మూడు గడియలైన తరువాత నాగవల్లికాశాతకర్ణులను గూర్చుండబెట్టి బౌద్ధగురువులు శుభాశీఃపరంపరలు కురిపించిరి. రాత్రి యాఱుగడియలకు విదేహజా నదిపై దీపోత్సవము జరుగును. రాజదంపతుల నక్కడికాహ్వానించిరి. రాజు సరే ననెను. విదేహజ నర్మద కుపనది. అజాంతము నందు పుట్టి నర్మదలోఁ గలియుచున్నది. అజాంతమున కొక క్రోసెడు దూరమున నట్టడవిలో నా నది విశాలమై దీపోత్సవమున కనువుగా నుండును. ప్రతి వర్షము జరుగు కృత్తికోత్సవములందు దీపోత్సవము లక్కడనే జరుగును. నాగవల్లికాశాతకర్ణి రుద్రశ్రీలు సపరివారులై వాహనారూఢులై దీపోత్సవమునకుఁ బోయిరి అంత రాత్రివేళ గూడఁ బదివేలమంది బౌద్ధశ్రమణకు లాయుత్సవమునఁ బాల్గొనిరి. ఉత్సవమైన తరువాతఁ గొండపై బుద్ధుని పదచిహ్నము లున్నచోటికిఁ జూడఁబోయిరి. ఆచోటికి వాహనములు పోలేవు. కాలినడకనే పోవలయును. శాతకర్ణి నీరాయుధుఁడై పాదచారియై కొండ నెక్కుచుండెను. వెనుక నాగ

వల్లిక పాదచారిణియై వచ్చుచుండెను. ఆ త్రోవ ఏకమనుష్య గమ్యము. రుద్రశ్రీ నాగవల్లికకు వెనుక సాయుధుఁడై వచ్చుచుండెను. బౌద్ధశ్రమణకులు ముందు వెనుక నుండిరి. ఇంతలో నొక బౌద్ధశ్రమణకుల గుంపు వెనుక నుండి త్రోసికొని వచ్చుచుండెను. మఱికొందరు బౌద్ధశ్రమణకులు వారి నడ్డగించి తొందరవలదని నివారించుచుండిరి. కాని వారు త్రోసికొనియే వచ్చుచుండుటచేత లొల్లి యయ్యెను. ఈ లొల్లిలో గుంపు నాగవల్లిక శాతకర్ణుల మీదఁబడకుండ రుద్రశ్రీ తన బాహుబలమువ దారినడ్డి నిలుచుండెను. కాని గుంపు నొత్తిడి యెక్కువైనది. ఆయన కేమియుఁ దోఁచలేదు. ఇది శత్రువుల కుట్ర యని విశ్వాసమొదవెను. రుద్రశ్రీ కత్తిదూసి దారినడ్డి నిలిచి 'శ్రమణకులారా! నే నిప్పుడు చేయునది పాపకృత్యము. అయినను నా రాజరక్షణమునకై నే నీపాపము చేసెదను. అడుగు ముందుకు వైచితిరా మీ ప్రాణములు మీవికా' వని యదలించెను. ఎదుటి గుంపులోనుండి హుంకారములు విన వచ్చినవి. ఇంతలో రాజపక్షీయమైన గుంపొకటి చుట్టుకొని ప్రతి హుంకారములు చేసిరి. అది వెన్నెల రాత్రియగుట తెల్లనియుడుపులు ధరించిన బౌద్ధశ్రమణకు లెత్తిన తెల్లని కరవాలములు తెల్లని వెన్నెలలోఁ దళతళలాడుచు గోచరించెను. రాజును బట్టుటకు వచ్చిన వారును రాజును రక్షించుటకు వచ్చిన వారును తలపడిరి. అప్పటికిఁ గొండపై నొక సమతలము వచ్చెను. దానిపై నిరువాగును యుద్ధమునకుఁ దలపడిరి.

రుద్రశ్రీ వ్రేటున కొక కాయగాఁ గొట్టుచుండెను. నాగవల్లిక యొడ్డాణముగఁ బెట్టుకొని యున్న పట్టాక త్తితీసి రాజుచెంతకుఁ బురుగురాకుండ గాయుచుండెను. రెండు గడియలు పోరుసాగినది. నూఱుగురు బౌద్ధశ్రమణకులు రుద్రశ్రీ కరవాలమున కెఱయైరి. కాని యింకను శత్రు పక్షము పెచ్చు పెరిగియే యుండెను. నాగవల్లిక రత్నపాంచాలికవలె, జక్రాలాతమువలె రాజును జుట్టి పరిభ్రమించుచుఁ బరాక్రమించు చుండెను. రాజు పకాలున నవ్వెను. ఆ నవ్వునకా పర్వతము మార్వ్రోలికెను. ఆయన శత్రువుల నుద్దేశించి 'యాగుఁడు, వృథా జనమారణము వలదు. అహింసామూర్తియైన బుద్ధదేవుని పవిత్రపద చిహ్నాతమైన యీ పుణ్యస్థలమున రక్తపాతము కూడదు. మీ కేమి కావలయునో చెప్పు' డనెను. శత్రువులలో నగ్రస్థానమున నున్నయొక శ్రమణకుఁడు 'మిమ్ము జీవగ్రాహముగాఁ బట్టుకొని రమ్మని మా ప్రభువుల యాజ్ఞ. మిమ్ము బట్టుకొననిదే మేము పో' మని నిర్భయముగ సమాధాన మిచ్చెను. రుద్రశ్రీ రుద్రుఁడై 'మీ తలలేరి తోరణములు కట్టెదను. అప్పుడు మారాజును బట్టుకొని పోవుదురు గాని' యనెను. శాతకర్ణి మఱల నడ్డము వచ్చి 'నన్నుఁ బట్టుకొని రమ్మన్నది మీ రాజా? లేక మీ రాజు కూతురా?' యని ప్రశ్నించెను. ఎదుటి సేనలో వెనుకగా నున్న యొక బౌద్ధశ్రమణకుఁడు 'మా రాజు కూతురే' నని సమాధాన మిచ్చెను. అంత శాతకర్ణి యిట్లనెను. 'సరియే! రుద్రశ్రీ

మహాశయా! వృథా జనమారణము చేయకుము. నాగవల్లిక! నీవును శాంతింపుము. ఈ చోటు నెత్తురు చిందరానిది. ఉజ్జయినీపతి మాట మనము గౌరవింతుము. అయిన నొక్క నిబంధనము. ఎదిరివారు మన యశ్వములపై మన మెక్కి వచ్చుట కంగీకరించ వలయును. అట్లయినచో మన ముజ్జయినికిఁ బోవచ్చు' ననెను. రుద్రశ్రీ 'రాజాజ్ఞ' యని ఖడ్గము నొఱలో దూర్చెను. నాగవల్లిక యొడ్డాణము బిగించి శాంతశ్రమణిక యయ్యెను. ఎదిరి వారీ నిబంధనమున కంగీకరించిరి. రాజు నాగవల్లికారుద్రశ్రీ సహితుఁడై పర్వతము నవరోహించెను. వారు ముగ్గురు మత్తాశ్వముల నెక్కి చుట్టును బౌద్ధశ్రమణక వేషములతో నున్న సైనికులు బలిసిరా యుజ్జయన్యున్ముఖులై పర్వత మార్గమునఁ బోయిరి. వెంటనున్న బౌద్ధశ్రమణకులు కొందఱు రుద్రదామునకు రుద్రాణికి జయ జయ ధ్వనులు సేయఁగా మఱికొందరు నాగవల్లీశాతకర్ణులకు జయజయ ధ్వనులు సేయుచుండిరి. కొంత దూరము పోవునప్పటి కొక విషయము స్పష్టమయ్యెను. శాతకర్ణి ససైన్యుఁ డని యెదుటి పక్షమునకుఁ విదిత మయ్యెను.

---



శాతకర్ణి సపరివారుఁడై యుజ్జయిని కోటగవను జేరు నప్పటికిఁ బ్రొద్దుపొడుచు చుండెను. రుద్రదాముఁడు గాని, యమాత్యులు గాని యెవ్వరును నెదురు రాలేదు. రుద్రదాముకు రుద్రాణికి జయజయ ధ్వనులు సేయుచున్న వర్గము ముందుగాఁ గోటలోఁ బ్రవేశించిరి. వెనుక శాతకర్ణి సపరివారుఁడై కోటలో నిశ్చలచిత్తముతోఁ బ్రవేశించెను. వారి యశ్వములు సరాసరి రుద్రాణి యంతఃపురావరణము లోనికిఁ బోయినవి. ఇటు పొమ్మన్న వారు గాని, యిటు పోవలదన్న వారు గాని యెవ్వరును లేకుండిరి. రాజు గుఱ్ఱమును దిగి కళ్ళెము నొక శ్రమణకున కప్పగించి యంతఃపుర సౌధసోపానముల పైకిఁ బోయెను. నాగవల్లికయు రుద్రశ్రీయును రాజును వెంబడించిరి. ఎదురుగా రుద్రాణి చెలికత్తెలుగాని, పరిచారికలు గాని యెవ్వరును రాలేదు. రాజు ముందునకు నిశ్చింతగఁ ద్రోసికొని పోవుచుండెను. మువ్వురును బాహిరమునకు నిరాయుధులుగనే కన్పడుచుండిరి. రాజు రుద్రాణి శయ్యాగారమునకుఁ బోయెను. ఆ సౌధము రాజునకుఁ బూర్వపరిచితమే. రాజు రుద్రాణి కెదురయ్యెను. శయ్యాస్థితయైయున్న రుద్రాణి రాజును జూచి లేచి నిలువఁబడెను. అప్పుడొక పరిచారిక వచ్చి ముప్పురకు నుచితాసనముల నేర్పాటు చేసెను. రుద్రాణి కనుసన్న యెఱిగి మఱియొక పరిచారిక రాజు నభ్యంగనము

సేయ నాహ్వానించెను. 'బంధితున కభ్యంగమా ?' యని రాజనగా, రుద్రాణి 'బంధితులైన సంకెలలేవి' యని మార్వాలి కెను. "ఈ సంకెల లాంతరములు. నేను ప్రణయ స్వర్ణ శృంఖల ములచే బంధితుఁడనై యున్నాను. నీ మూలముగ నూఱుగురి ప్రాణములు పోయినవి. ఏదైన సహింప గలుగుదును గాని ప్రాణహింస నేను సహింపలేను. మనము చక్రవర్తుల మని, మహారాజ్ఞుల మని నోరెఱుఁగని యా జీవులు మనలను సేవించు చుందురు. వారి ప్రాణములను మన స్వార్థములకై తీయు చుండుట యనాది సాంప్రదాయమై పోయినది. ఇది కిల్బిష హేతువు. నీవు నన్ను బంధించఁ దలఁచు కొన్నచో నీవును నీ తండ్రియు వచ్చి స్వయముగా నాతోఁ దులాయుద్ధ మొనర్చి నన్ను బంధింప వచ్చును. ఇంతకును నన్ను నీవు స్వాధీనము చేసికొనఁ జూచుచున్నావు. అదియే నీ పరమ లక్ష్యము కదా ! నే నిదివఱకే నీకు స్వాధీనుఁడనై యుంటిని. ఈ విషయమును నీ వెఱుఁగ లేకుంటివి. ఇది పిష్ట పేషణము. నన్ను బట్టికొని నీవేమి చేయుదువు. నా రాజ్యమును జేఁజిక్కించు కొందువా ? అది నీ కితఃపూర్వమే హస్తగతము కదా ! అఱచేత నున్న యామలకమునకై విశ్వమును గవేషించు వెఱ్ఱివాండ్రుందురా ? ఉందురు. అట్టి స్థితియే నీది. పరమాంతరమై ప్రత్యబ్మూర్తియై యున్న యాత్మపదార్థము నెఱుఁగలేక జీవులు మాయామో హితులై యున్నారు. నీవు రాజధానిని వదలి వచ్చుటలోని యాంతర్యమేమో నాకుఁ దెలియకున్నది. వచ్చి నీవు సాధించిన

దేమి ? ఇప్పటికి నూర్గురి హత్య. ఇది యిట్లే సాగినచో నెన్ని లక్షల మంది హతులగుదురో యాలోచించితివా ? 'రాజ్యాంతే నరకం ధ్రువ' మ్మను మాట యథార్థము. ఇంతకును నీకుఁ గావలసినది నేనా ? నా రాజ్యమా ? నేను గావలసినచో నిప్పుడే నీ పాదపురోవర్తినై యున్నాను. ఆ మాట నీవు చెప్పుము. నే నిఁక రాజధానిఁ బోవను. ఉజ్జయినిలోనే యుండి రుద్రదాముని పిత్రార్జితము నుభయులము దినుచుందుము. రాజ్యము కావలయునా, రమ్ము. ధాన్యకటకము నీకై యెదురు చూచుచున్నది. నా చక్రవర్తి ముద్ర నీ కొసంగెదను. ఇందు నీ కేది కావలయునో కోరికొనుము. నే నిప్పుడే రాజ్యపరిత్యాగము చేయుచున్నాను. నన్ను బంధింప నీవు ప్రయత్నించితివి. అది వట్టి వెఱ్ఱి. నన్ను బంధించుటకు నీ బలము, నీ తండ్రి బలము చాలదు. ఉజ్జయినీ నగరము నాది. అనఁగా నిందున్న బలములో సగము నాది. తలచుకొన్నచో నిన్నును నీ తండ్రిని నేను బంధించుకొని పోవఁగలను. కాని యా పని చేయుట నా కిష్టములేదు. నీ ప్రణయమును సాధించి నిన్ను స్వాధీనపతికను చేయుట నా విధి. బాహ్యాభ్యంతరముల స్వాధీనపతికయై యుండునదియే పతివ్రత. ఆమె మోక్షార్హురాలు. ఆమె మాటకు జగములు వడంకును. ద్రవ్యములు జడములు. ఉపాధులు జడములు. ఈ జడముల నను ప్రాణితముచేయు నాత్మవస్తువు మూలముగా నివి ప్రాణవంతములై చరించుచున్నవి. ఆత్మవస్తువు నెఱుఁగని వివేకము వివేకము కాదు.

అది యజ్ఞానము. నీవు రాజధానికి రమ్ము. నే నింతకంటె నీకుఁ జెప్పునది లేదు."

రాజు మాట్లాడినంతసేపును రుద్రాణి తలవాల్చి వినుచు నూరకుండెను. ఒక్క మాటయైనఁ బల్లెత్తియాడలేదు. ఒక్క నిమేషకాలము శాంతముగ నుండెను. ఎవ్వరు నెవ్వరితో నేమియు ననలేదు. రుద్రశ్రీ యిట్లనెను. "తల్లీ, మా వంశమువారు మూడు తరముల నుండియు మీకు దండనాథులుగా నున్నారు. మా యోగ క్షేమము లన్నియు మీతో ముడివడి యున్నవి. ఆంధ్ర విష్ణువు నుండి వచ్చుచున్న యీ శాతవాహన వంశ ప్రతిష్ఠను నీవు గంగలోఁ గలుపకుము. మీ వారెల్లరు వశిష్ఠారుంధతుల వలె లోపాముద్రాగస్త్యుల వలెఁ గాలక్షేపము చేసి యెనలేని కీర్తి నార్జించినవారు. ఈ వంగడములోని స్త్రీలు ప్రత్యేకముగ మాతృత్వయశస్సు గడించినవారు. మీ అత్తగారు వాశిష్ఠిని గుఱించియు, నామె యత్తగారు గౌతమిని గుఱించియు లెక్క లేనన్ని కథలు, చిత్రచిత్రమైనవి, జనుల వాడుకలో నున్నవి. వారు పాతివ్రత్యమునకు, శౌర్యమునకుఁ, నాభిజాత్యమునకుఁ బెన్నిధులు. వారి కోవలోఁబడిన నీ విట్టి యపమార్గము నొందుట క్షేమంకరము కాదు. ముఖప్రీతి వచనములు కాదుగాని శాతకర్ణి చక్రవర్తి జనకాది రాజర్షులతోఁ బోల్పఁదగినవాఁడు. ఆయన దేవేరివైన నీ వకలంకమైన యశోనిధానమవై వెలుఁగొంద వలయును. కటకమునకు రమ్ము. నీ రాజ్యమును నీవు

పాలించుకొనుము."

వృద్ధరుద్రశ్రీ మాట్లాడినంత సేపును రుద్రాణి యాయన మోమువంకఁ జూచుచుండెను గాని యప్పుడును బల్లెత్తి మాటాడలేదు.

నాగవల్లిక యింతవఱకుఁ దూష్ణీంభావముతో నుండియు నిప్పుడు కొంచము 'యక్కా!' యని సంబోధించెను. రుద్రాణి త్రొచుపాము తోఁకపై నిలువఁబడినట్లు చుఱచుఱ చూచుచు నామె వంక దిరిగెను.

'నేను గూడఁ గొంత చెప్పదమని యున్నదికాని నీ కంటె నా కెక్కువ తెలిసినది లేదు. అయినను మీ దాంపత్యమునకు నెఱుసువలె వచ్చి యింత గగ్గోలునకుఁ గారణభూతురాలను నే నగుట నాకుఁ గొంత బాధ్యత యున్నది. నే నొకటి చెప్పెదను. నేను సన్న్యసించితిని. నా కీ సంసారముపై వ్యామోహము లేదు. ఈ రాజు వల్ల నేను భూతభవిష్యద్వర్తమానముల యందెట్టి శారీరక భోగమును బొందియుండలేదు. మా యిరువురి కలయికలో నొకానొక యాత్మానుభూతి నొందితిమి. అది లోకదృష్టిలో వివాహముగాఁ బరిణమించినది. అంతేకాని నే నెప్పుడును నీ స్థానము నాక్రమింపలేదు. ఆక్రమించు నిచ్ఛయు లేదు. అయినను నే నింక రాజధానిలో నుండఁదలచుటలేదు. రాజధానిలో నుండినచో నేదో సంసార బాధ్యత నాపైఁ బడుచునే యుండును. కావున

నొకటి రెండు మాసములలో నేను బదరీయాత్రకుఁ బోవుచుంటిని. అప్పు డిఁకఁ దిరిగి రాను. అచ్చటనే యొక యాశ్రమము నేర్పాటుచేసినొని జీవితశేషమును గడపుదును. నీవు రాజధానికిఁ బొమ్ము. నీ మగనితో సుఖముగా గాలక్షేపము సేయుము. నా మాటల యందేమేని దప్పులున్నచో క్షమింపుము."

నాగవల్లిక మాట్లాడినంతసేపు రుద్రాణి కన్నులలో నిప్పులు కురిసెను. ఆమె క్రోధోద్రేకము పట్టఁజాలక యిట్లన్నది. 'అపకారి యపకార మొనర్చి యెదుటి వాడు బాధపడుచుండ నోదార్చుటకు వచ్చి తన గొప్పదనమును ప్రకటించును. అది రాక్షసత్వము. నీవు రాక్షసివి. నీవు బదరికిఁ బోవుట కంటెఁ గైలాసమున కేగుట మంచిది. మిథ్యావేదాంతములు, నపభ్రంశపు తత్త్వములు చెప్పుచు నిహమునకుఁ బరమునకు జెడునట్టి నీ వంటి భ్రష్టులతో నాకుఁ బనిలేదు. నిన్ను క్షమించుట నా వలన గాదు- నీ వంటి క్లిష్టపరిక్రుతుల శరీరములనుఖండ ఖండములుగాఁ జేయుట మంచిది.'

నాగవల్లిక యాసనము నుండి లేచి తన యొడ్డాణపు పట్టాకత్తిని దీసి తన రెండుచేతులలోఁ బట్టుకొని రుద్రాణి యెదుట మోకరించి, 'మహారాజ్ఞీ! నేను దప్పిదము కావించితిని. ఈ కత్తితో నా కంఠముఁ ద్రుంచుము. దానితో సమస్తారిష్టములు తొలఁగిపోవు' ననెను.

రుద్రాణి లేచి కొంచెమెడముగాఁ బోయి రాజువంకఁ జూచి 'వ్యావహారిక పారమార్థిక సత్త్వప్రమాణములను విశదముగా నెఱుఁగని యవివేకపు తాత్త్వికులతో నాకు నిమిత్తము లేదు. సర్వభూతాత్మవృత్తిని సాధించి మోక్షము నొందుదురేమో కాని కామినీ కాముకులయం దాత్మ దర్శనము చేయుట విపరీత ధీవృత్తి కాని వేఱొండు కాదు. ఇట్టి భ్రష్టుల పాణిగ్రహణములు తీయుట కూడ దోషమే యగును. నేను బోవుచున్నా' నని వెనుదిరిగెను.

నాగవల్లిక 'రాజ్ఞీమణీ ? నే నింక జీవితశేషమెల్ల నీకు పరపుడము చేయుదును. క్షమించి రాజధానికి ర'మ్మని బతిమాల బోయెను.

రుద్రాణి చెంగు విదలించుకొని యంతఃపురములోనికిఁ బోయెను. శాతకర్ణి లేచెను. రుద్రశ్రీ వెంబడించెను. నాగవల్లిక వెనువెంట వచ్చెను. వారు మువ్వురు దమ యశ్వములున్న కడకు బోయిరి.

# ౧౦

భదంతుఁడు రుద్రాణి యొద్దకు వచ్చెను. యజ్ఞదత్తుఁడును వచ్చెను. రుద్రాణి 'యేమండీ! అమాత్యవర్యా! మీ పథక మిట్లు పాడై పోయినదేమి' యని ప్రశ్నించెను. 'అమ్మా! ఇది చదరంగము. ఒకప్పు డొక పక్షము గెలుచును. మఱి యొకప్పుడు మఱియొక పక్షము గెలుచును. గెలుపు దైవాధీనము. ప్రయత్నము మానరాదు. అయితే విష్ణుశ్రీదత్తుని మేధ చాలగొప్పది. ఆయన పన్నిన వ్యూహమును భేదించుట చాలకష్ట"మని యజ్ఞదత్తుఁడు విన్నవించెను.

రుద్రాణి :- ఇక మనమేమి చేయవలయును ?

యజ్ఞదత్తుఁడు :- రాజనీతి షడంగ యుక్తమైనది. సంధి విగ్రహాదులలో సంధికిఁ బ్రాధాన్యముండుట చేతనే ప్రథమ గణ్యమై యున్నది.

రుద్రాణి :- ఆ యవకాశము నిన్న తప్పిపోయినది. గదా!

యజ్ఞ :- అమ్మా! ఇది సంసారము. మీ రీనాడు సపరివారముగ ధాన్యకటకమునకు బయలుదేరినచో మిమ్మడ్డు వారెవ్వరును లేరు.

రుద్రాణి :- ఇక్కడనా ? కటకములోనా ?

యజ్ఞ :- ఉభయ నగరము లందును.

భదంతుఁడు :- నిన్నఁ జక్రవర్తి ని ప్రత్యక్షముగ నిరాకరించి యీ నాడు కటకమునకుఁ బోవుటలోఁ బరువుండదు.

యజ్ఞ :- నిన్న నిరాకరించినది చక్రవర్తిని గాదు. ఆ నిరాకృతి నాగవల్లికా విషయికము.

భదంతుఁడు :- అది చక్రవర్తిదే.

రుద్రాణి :- ఉజ్జయిని యింత నిర్వీర్య మగుటకు గారణ మేమి ?

యజ్ఞ :- ధనలోపమే దానికి ముఖ్యకారణము.

రుద్రాణి :- ధనలోపమా ? బుద్ధి లోపమా ?

యజ్ఞ :- తమ కెందుల కట్లు తోఁచినది.

రుద్రాణి :- పరులు ముప్వురు మత్తాశ్వముల నెక్కి రాజపథమునఁ బోవుచుండ నడ్డగింప గలిగిన మగవాఁడే లేఁడా యీ వీట.

యజ్ఞశ్రీ :- తల్లీ! క్షమింపుడు. సైన్యములో సగము విష్ణుశ్రీదత్తున కమ్ముడు వోయినది. విచారింపఁగా మన సేనానాయకులలోఁ బలువు రాంధ్రులు.

రుద్రాణి :- మీరు నిద్రించుచుంటిరా ? ఛీఛీ ! నే నీ నగరమున నుండను.

యజ్ఞ :- కటకమునకుఁ బోవుదురా ?

రుద్రాణి భదంతుని వంకఁ జూచెను. భదంతుఁ డావేశ ముతో నిట్లనెను. 'అమ్మా, మీరు వెఱువ వలదు. ఆంధ్ర సామ్రాజ్యమును ధ్వంసము చేయనిదే మనము కన్ను మూయ రాదు. ఆంధ్రులను జయించుట కిప్ప డుజ్జయిని పనికి రాకుండఁ బోయినది. మనము శ్వేతగిరికిఁ బోవుదము. శబరపుళిందు లాంధ్రులపైఁ గత్తి నూరుచున్నారు. వారికి ధనసహాయము చేసినచో వా రపారమైన సైన్యముతో నాంధ్రసామ్రాజ్యము పైఁ బడుదురు. పశ్చిమము నుండి యపరాంతకాధిపతిని బ్రేరే పింప వచ్చును. ఆతఁడు కూడ నాంధ్రులపైఁ గసి పట్టి యున్నాఁడు. ఆతనికిఁ ధనాశ చూపించినచో నాంధ్రులపై దిరుగఁబడును.

యజ్ఞ :- ఇంత ధన మెక్కడ నుండి వచ్చును.
భదంతుఁడు :- నే నిచ్చెదను.

రుద్రాణి చిఱునవ్వుతో భదంతుని వంకఁ జూచెను. ఆ వీక్షణము భదంతుని స్వర్గకవాటము దాటఁ జేసినది. ఒడలు పులకరించినది. ఉన్నట్లుండి యతని నేదో యొక భూతము పట్టుకొన్నట్లయి తక్షణము వాని యందున్న లోభమెల్లఁ బటా పంచలై పోయి సర్వస్వ త్యాగము సేయుటకు సిద్ధపడి యిట్లని యెను. 'అమ్మా ! మీ కోఱకై నేను నా సర్వస్వమును బరిత్యజించెదను. శబర పుళిందు లిదివఱకే నా కప్పువడి యున్నారు. వారి దేశమున ధనరాసులు వెదజల్లి మహో

సైన్యమును సమకూర్తును. అపరాంతకాధిపతి విద్యాశ్రీయును నాకు మిత్రుఁడు. ఆతఁడు పశ్చిమము నుండి, మనము ప్రాగ్భాగము నుండి యాంధ్రుల నొత్తిడి చేయుదము. వారు లొంగక తప్పదు. చక్రవర్తి మనకుఁ బూర్తిగ లోఁబడిన తరువాత మన కార్యము సుకరమగునని యుచ్చైస్స్వరమున బలికెను. అప్పటికే యచ్చటికి వచ్చిన రుద్రదాముఁడును తథాస్తనఁగా రుద్రాణీ భదంతులు శ్వేతగిరికిఁ గదలి పోయిరి. శ్వేతగిరి శబర రాజధాని. అది ప్రాక్సముద్ర తీరమున నున్నది. దానికి రాజుగా నున్న త్రిపురారి భదంతునకు మిత్రము. భదంతుఁ డారాజు తన కీయవలసి యున్న పదివేల దీనారముల బాకీని రద్దు చేసెను. పదిలక్షల సైన్యమును గూర్చికొని ప్రతిష్ఠానమును బట్టుకొన్నచో నా వ్యయమును దాను భరించుటయే గాక త్రిపురారికిఁ బదిలక్షలు పసదన మిత్తునని యాశ పెట్టెను. రుద్రాణియే యా సైన్యమునకు సర్వసైన్యాధిపత్యము వహించును. సైన్యమును రెండు భాగము లొనర్చి యొక భాగమునకుఁ దానును మఱియొక భాగమునకుఁ ద్రిపురారియు సేనాపతులుగా నుందురు. ఈ సైన్యమంతయు రాబోవు వైశాఖ బహుళామావాస్య నాటికిఁ బ్రతిష్ఠానమును బట్టికొనవలెను. ప్రతిష్ఠానము చేతఁ జిక్కినచో నాంధ్రసామ్రాజ్ఞి రుద్రిణి వేఱుగా రాజ్యమును స్థాపించి పతాక నెత్తును. శాతకర్ణికి సంతానము లేదు. రుద్రిణియే న్యాయముగా నాంధ్ర సామ్రాజ్యమునకు వారసురాలగును. శాతవాహన సామ్రాజ్య సంప్రదాయము

మొదటి నుండియు మాతృప్రధానముగనే నడచుచున్నది. శాత కర్ణిని సంహారించినచోఁ దాను దన కుమారుఁడైన హిరణ్యాదం తుని రుద్రాణికి దత్తుచేసి యాంధ్రసామ్రాజ్యాధి నేతృత్వము సంపాదింప వచ్చును. ఈ పథకమును మనస్సులోఁ బెట్టుకొని భదంతుఁడీ జైత్రయాత్ర కెన్ని కోట్లదీనారములనైన వెచ్చింప దలపెట్టెను. భదంతుఁ డపరాంత దేశ రాజధాని యైన సోపార నగరమున కేగి విద్యాశ్రీతో మాటలాడెను. విద్యాశ్రీ లక్ష సైన్యమును సమకూర్చును. దానికగు వ్యయమంతయు భదంతుఁడు ముందీయ వలయును. 'సోపారనగరము పశ్చిమ సముద్రతీరమున నున్న రేవు పట్టణము. ఆంధ్రుల నౌకావాణిజ్య మా రేవు గుండ నడచుచుండెను. ఆంధ్ర వాణిజ్యనౌకలను గొల్లగొట్టి దానివలన లభించు ధనమును విద్యాశ్రీయును భదం తుఁడును బంచుకొందురు. ఇదియే విద్యాశ్రీకిఁ బసదనము. భదంతుఁ డిట్లిరు సముద్రములను బంధించితి నని సంతోషపడెను. శ్వేతగిరి గూడ సముద్రపు రేవు పట్టణమే. శ్యామదేశాధిపతి యైన విజయతుంగుని వాణిజ్యనౌకలా రేవునకు వచ్చుచుండును. ఆతఁడు శాతకర్ణికి మామ కదా! వాని యోడలను గూడఁ దాను గొల్లగొట్ట వచ్చును. ఇట్లు తానీ జైత్రయాత్రలో వ్యయ పఱచు ధనమును గూడదీసికొనవచ్చును. తనకుఁ గాసు కూడ నష్టము లేకుండ నాంధ్ర సామ్రాజ్యమునకు జక్రవర్తిని గావచ్చు నని భదంతుఁ డాకాశమున హార్మ్యములు కట్టెను.

కామలోభములు రెండును బావమఱదుల వంటివి. ఇట్లాంధ్ర సామ్రాజ్యము తనకు హస్తగత మగుటయే గాక రుద్రాణి తనకు వశురాలగును. ఈ యూహ వాని మనస్సులో నుదయించి నప్పుడెల్ల భదంతునకుఁ జెమటలు పట్టును. ఒడలు జలదరించును. కనులు తేలిపోవును. పారవశ్యము కలుగును. రుద్రాణి జగదేకసుందరి. ఆమెకు రాని యాయుధ విద్యలేదు. ఆమె సర్వయుద్ధములందును బారీణురాలు. ఆంధ్ర సామ్రాజ్య మహారాజ్ఞి. పతితోఁ గలహించి వేఱైన భామిని. ఆమె తన్నుఁ గామించినచో నికఁ దన జన్మము సార్థక మగును. దానికై తన సర్వస్వమును త్యాగము సేయును. తన ప్రాణములనైన నర్పించును.

ఇట్లూహా సౌధములఁ గట్టుచున్న భదంతునికి రుద్రాణి యెదురయ్యెను. అతఁ డెందులకో హఠాత్తుగ నులికిపడి నట్లయ్యెను. కాని వెంటనే సర్దుకొని రుద్రాణితో 'మహారాజ్ఞికి సేమమా ?' యని ప్రశ్నించెను. రుద్రాణి చిఱునవ్వు నవ్వెను. అ చిఱునవ్వుతో భదంతుఁడు పారవశ్యము నొందెను. రుద్రాణి యితని యీ పారవశ్యము నెఱుంగును. ఆమె మనస్సు జాగరూకమైన స్థితిలో నున్నది. భదంతుని నెంత దూరము నుంచవలయునో యామెకుఁ జక్కగాఁ దెలిసి యున్నది. వీఁడు కామలోభాంధుఁడై తన్నాశ్రయించు చున్నాఁడు. తనకో యాంధ్ర సామ్రాజ్యముపై వైరము లేదు. తన మగనిపై వైరములేదు. తన సవతి యైన నాగవల్లికపై వైరము పూనుట

తన పదవికి భంగము. ఇంకc దన వైర మెవరితో? శాత కర్ణి నడవడితో. తాను మహారాజ్ఞి. తాను సామ్రాజ్యమాత. శాతవాహన సంప్రదాయ మిది. తన్నుc గాదని వేఱొక తె కా స్థానమొసంగిన శాతకర్ణి ప్రవర్తనము క్షంతవ్యము కాదు. అందువల్ల నతనికిc బదవీభంగ మొనర్చి యా సింహాసనమును దాను హస్తగతము చేసికొన వలయును. ఇది సాధ్యము కాకపోవచ్చును. కార్య దురంధరులు సాధ్యాసాధ్యములను విచారింపరు. తన విధి తాను నిర్వర్తించును దీనికి భదంతుc డొక సాధనము. శ్వేతగిరి సోపారనగరముల యందొకటి రెండు వాణిజ్యనౌకలను భదంతుcడు కొల్ల గొట్టించెను. దానిచే రుద్రాణి మనస్సు చివుక్కు మనెను. తా నోడదొంగ యగుట తన కిష్టములేదు. భదంతునితో నేకమై యకార్యకరణము చేయుట తన యాత్మకు విరుద్ధమైన పని. భదంతుcడు మితి మీఱినచో? ఆమె దృష్టి కరవాలముపైc బడెను. ఆమె ముఖమున వీరహాస ముదయించెను.

౧౧

శ్వేతగిరి సోపారముల రేవులలో నాంధ్ర వాణిజ్య నౌకలు కొల్లగొట్టబడినవి. ఆంధ్రవీరవణిజు లుభయ స్థలముల యందును మహాయుద్ధము చేసిరి. కాని లాభము లేకపోయెను. అపరాంతకాధిపతి విద్యాశ్రీయును శబరదేశాధిపతి త్రిపురారియు దీనికి బాధ్యులు. ఆంధ్రుల కీ దొద్దల వలన రెండులక్షల దీనారములు నష్టము వచ్చినది. విష్ణుశ్రీగుప్తు డుభయరాజులకు లేఖలు పంపెను. సంతృప్తికరమైన సమాధానములు రాలేదు. వారిదివఱకు మిత్రులు గాకపోయినను దటస్థులుగా నుండిరి. ఇప్పు డిట్లు వైరులుగా మాఱుటకుఁ గారణమేమి? విష్ణుశ్రీదత్తు డాలోచించెను. వేగు దీసెను. భదంతుని యకాండ తాండవ మంతయు నద్దము నందువలె గోచరించెను. విషవృక్షమును మొలకగా నున్నప్పుడే త్రుంచివేయవలయును. భదంతుఁడు పదిలక్షల సైన్యమును సిద్ధపఱచుచున్నాడు. శబరాధిపతి త్రిపురారికిఁ బినతండ్రి కుమారుఁడు పర్వతరాజను పేరుగలవాఁడొకఁ డున్నాఁడు. అతనికి నన్నగారికి సింహాసనము విషయమున బేచీలున్నవి. మున్నతఁ డాంధ్రుల సాహాయ్యము నర్థించెను. నిష్కారణముగఁ బరుల గొడవలలో దిగుట యెందులకని విష్ణుశ్రీదత్తుఁ డాతనికి సాహాయ్య మొనరింపలేదు. ఇప్పు డాతనికి సాహాయ్యము చేయుదునని పరోక్షముగఁ జెప్పించి రప్పించెను. ఆంధ్ర సైనికులు దాదాపు రెండు లక్షల వఱకు

శబర సైన్యములో జేర్పించెను. ఆంధ్రులకు విశ్వసనీయులైన పార్వతీయు లొక లక్షమంది కూడ శబర సైన్యమున జేరిరి. శబరుల మూలసైన్యమొక లక్ష మాత్ర ముండిరి. వారు పర్వత యుద్ధమునందు మాత్రమే నిపుణులు. తక్కిన యుద్ధముల విషయము వారి కెఱుకలేదు. ఛద్మవేషములతో వారి సైన్యమున జేరిన యాంధ్ర పార్వతీయు లెల్లరు సర్వాయుధ పర్వ యుద్ధ విశారదులు. వీరు సమయము వచ్చినప్పుడు త్రిపురారి కెదురు తిరుగుట కేర్పాటయ్యెను. ఈ మూడు లక్షలసైన్యము నకుఁ బర్వతరాజు సర్వసేనాని. త్రిపురారిని సంహరించి శబర సింహాసనము నెక్కుట కిది పర్వతరాజున కదను. ఆతఁడు సంతోషించి యీ కార్యమును దలతోఁ దీర్చుటకు సంసిద్ధుఁ డయ్యెను. ఈ సైన్యమునకు భదంతుఁడు వేతన మిచ్చును. ఆ సైన్యములు తన పనిని నెఱవేర్చును. వాని వ్రేలితో వాని కన్నే పొడిచినట్లగును. ఇక విద్యాశ్రీ. అపరాంతకము పర్వత దేశము. వారి కుప్పతోఁ బదియును బ్రతిష్ఠానము నుండియే పోవలయును. ఆంధ్ర మహామాత్యుడు ప్రతిష్ఠానము నుండి భరుకచ్ఛమునకుఁ బోవు సార్థములను మార్గము తప్పించి విదిశ మార్గమునఁ బొండని యాజ్ఞాపించెను. దానితో నపరాంతము నకుఁ దినఁదిండి దొరకదు. విష్ణుశ్రీదత్తు డాంధ్ర వాణిజ్య నౌకలను శ్వేతగిరి సోపారములకుఁ బోవలదని యాజ్ఞాపించి యాంధ్రసైన్యమును సపరికరము, సాయుధము కావించి రెండు భాగములు చేసి ధాన్యకటక ప్రతిష్ఠానములందు నిలువఁ జేసి

యుద్ధమునకు సంసిద్ధుం డయ్యెను. శాతకర్ణి తాను ప్రతిష్ఠాన సైన్యమునకు సర్వసేనాధ్యక్షత వహింతు ననెను.

భదంతుఁ డనుకొన్నంతపని కాలేదు. అతఁడు మొత్తము నాలుగు నౌకలను గొల్లగొట్టెను. అందు రెండు నౌకలు విదేశములకు సరకు లమ్మి తిరిగివచ్చినవి. అందెక్కువ ధనము సమకూడలేదు. తక్కిన రెండు నౌకల యందు రెండు లక్షల ధనము లభించెను. రెండు లక్షలతోఁ బది లక్షల దండును సమకూర్చుట యెట్లు ? తన భండారమును వెచ్చించుట కతఁడు కొంచెము వెనుకాడెను. పైగా నౌక మిడిమేళము వచ్చెను. విష్ణుశ్రీదత్తుని యాజ్ఞచే శ్యామ యవ బలి ద్వీపాధిపతులు భదంతునీ వాణిజ్య నౌకలను నాలుగింటిని నిరోధించిరి. వాని మూలమునఁ బాతిక లక్షల దీనారములు నష్టము వచ్చునట్లుండెను. అయినను నతఁ డెట్లో తంటాలుపడి యాఱు లక్షల సైన్యమును సమకూర్చెను. అందు మూఁడులక్షలాంధ్రసైన్య మని చెప్పియే యుంటిమి. ఈ సైన్యము యొక్క యాహార విహారముల కనంతమైన వ్యయ మగుచుండెను. భదంతుఁ డీ వ్యయము భరింపలేక తొందరపడి సైన్యము నాంధ్రులపై నడిపించెను. రుద్రాణి కను గలిగియేయున్నది. తాను సర్వసేనాధ్యక్షురాలు. త్రిపురారియు రుద్రదాముఁడు సేనాపతులు. త్రిపురారి సైన్యమున నాంధ్రులే మిక్కుటముగ నుండిరి. రుద్రదాముని సైన్యమున ధనక్రీతులైన సైనికు లుండిరి. ఏనుగులు, గుఱ్ఱములు లేవు. అంతయును వట్టి కాల్బలము.

శ్వేతగిరి నుండి బయలుదేరి యీ సైన్యము శబరదేశమును దాటి వింధ్యపాదము వెంబడి పయనించుచు, నూళ్ళను గొల్లగొట్టుచు వచ్చుచుండిరి. శాతకర్ణి కీ సైన్యపు రాకడను గూర్చి ప్రతి దినము వేగు వచ్చుచునే యుండెను. కాని యాయన యీ సైన్యము ప్రతిష్ఠానమును ముట్టడించువఱకు నేమియుఁ బ్రతి క్రియఁ జేయఁ దలపెట్టలేదు. ఎన్ని యూళ్ళు కొల్లగొట్టినను దిండికిఁ జాలక వారే యగచాట్ల నొందుచుండిరి. అందున్న యాంధ్రసైన్య భాగమునకుఁ బ్రత్యేకముగా నాహారాదికము లెట్లో సమకూడుచుండెను. త్రిపురారి సంతోషమున వచ్చుచుండెను. రుద్రదాముఁడు విన్నవోయెను. భదంతుఁడు మొదట సేనాధిపత్యము వహింత మనుకొనెను. కాని రుద్రాణి యతని దనతో నుండుమనెను. భదంతుఁ డది మహాభాగ్యముగ నెంచెను. ప్రతిష్ఠానము కనుచూపు మేరలోనికి వచ్చెను.

ప్రతిష్ఠానము బలిష్ఠమైన దుర్గము. అది యాంధ్ర చక్రవర్తుల కుపరాజధాని. దానికి సప్తప్రాకారములు కలవు. సప్త ప్రాకారములకు వెలుపల సముద్రమువంటి యగడ్త కలదు. కోట వెలుపలి ప్రాకారము చుక్కల నంటుకొనుచున్నది. దాని పై భాగమున శతఘ్ను లేర్పాటు చేయఁబడియున్నవి. కోట నాలుగు గవనులకుఁ బది యేనుగులు పట్టి త్రోసినను గదలని బలమైన ద్వారము లున్నవి. ప్రాకారముపైఁ గొమ్మకుఁ గొమ్మకు, దిడ్డికి దిడ్డికి ననేకాయుధపరికర సజ్జితులై యున్న వీరభటులు గాయుచుండిరి. భదంతున కీ కోట దృగ్గోచరమై

నంతనే గుండెలు దిగజారిపోయెను. ప్రతిష్ఠాన దుర్గ మతనికి బూర్తిగఁ బరిచితమైనదియే. కాని ముట్టడిచేయు దృష్టితోఁ జూచునప్పటికి దాని యసాధ్యత కనులకుఁ గట్టినట్లయ్యెను. అతఁడు ముక్కుపై వ్రేలిడుకొని కోటవంక నదేపనిగాఁ బరకాయించుచుఁ జూచుచుండెను. ఇంతలో రివ్వుమని యొకబాణము దుర్గ ప్రాకారస్థుఁడైన యొక ధానుష్కునిచేఁ బ్రయుక్తమైనది యతని కుడిచెవి దగ్గరగా దూసుకొనిపోయెను. ఆ శ్రేష్ఠి పై ప్రాణములు పైనిబోయినవి. అట నిలుచుండుట ప్రాణాపాయకర మని వెంటనే రుద్రాణి యొద్దకుఁ బోయెను. ఆమె యతని స్థితి గ్రహించి చిఱునవ్వు నవ్వుకొనెను. ఆ చిఱునవ్వు భదంతునికిఁ బ్రాణప్రదముకదా. అతఁడు స్వస్థుఁడై స్వకార్యమునందు నిమగ్నుఁడయ్యెను.

ప్రతిష్ఠానపు ముట్టడి ప్రారంభమయ్యెను. అది యేమి ముట్టడి ! ఏనుగులా, యశ్వములా ? అగడ్త దాటుట దేవతలకైన శక్యము గాకుండెను. రాత్రులందు దొంగపోటుగఁ దెప్పలుకట్టి గోడను జేరుదమని ప్రయత్నించిరి. అగడ్త దాటఁ బ్రయత్నించినవారికెల్ల నాంధ్ర ధానుష్కులు రంభాసంభోగ సుఖము నందించు చుండిరి. కోట స్వాధీన మగుటలేదుగదా ప్రాకారమును సమీపించుటకైనను వీలులేదు. నాలుగు దినములు గడచెను. భదంతుని సేనలు చుట్టుప్రక్కల యూళ్ళను దోడ్దసేయ నారంభించిరి. పల్లెటూళ్ళ రైతుల హాహాకారములు క్రమముగా శాతకర్ణి చెవుల సోకెను. చక్రవర్తి తనలోఁ

దాను నప్పుకొనెను. ఎలుకను బట్టుకొని చంపక దానితోఁ జెలగాటమాడు పిల్లివలె నాయన ముట్టడిదారుల సిలుగులబెట్ట నెంచెను. కాని పల్లెటూళ్ళ యొద్దడి విన్నమీఁదట నాయన యొక నిశ్చయము చేసికొని, కోట తలుపులు తెఱచి బహిరంగ యుద్ధమున శత్రువుల బాఱఁద్రోలవలయు నని యెంచెను. ముట్టడి యాఱవనాఁడు శాతకర్ణి తూర్పు గవను దెఱిపించెను. ఆంధ్రులు చతురంగబలముతో యుద్ధరంగమునకు నడిచిరి. వారి సింహపతాక శత్రుదుర్నిరీక్ష్యమై వెలుగొందు చుండెను. యుద్ధము ప్రారంభమైనది.

శాతకర్ణి వేఁగు నడిపెను. పర్వతరాజు మూఁడులక్షల సైన్యముతోఁ ద్రిపురారిని బరిత్యజించి వత్తుననియు, నాతని శిరస్సును శాతకర్ణి పాదములపైఁ బడవైతు ననియు వేగు బంపెను. శాతకర్ణి పదివేలమంది వీరభటులను, నూ ఱేనుగులను, వేయిమంది యాశ్వికులను శత్రువులపైఁ బురికొల్పెను. యుద్ధము మధ్యాహ్నము వఱకు ముమ్మరముగ సాగెను. ఇంతలోఁ ద్రిపురారి సైన్యమున గదలిక కలిగెను. పర్వతరాజ నాయకత్వమున మూఁడు లక్షలమంది సైనికులువచ్చి యాంధ్ర సైన్యమునఁ గలసిపోయిరి. ఎవఁడో యొక యజ్ఞాతవీరుఁడు త్రిపురారి శిరస్సును ఖండించి, జెండాకఱ్ఱకు గట్టి గుఱ్ఱముపై శాతకర్ణి యున్నవైపున కుడాయించు చుండెను. శ్వేతగిరి సైన్యము నిరుత్సాహము నొంది పలాయనము చిత్తగించు చుండెను. కాని రుద్రాణి పరవసముచేసి సేనను నిలువరించి

శత్రువుల మార్కొనఁజేసెను. పడమటి గవను నొద్ద ముట్టడి సాగించుచున్న రుద్రదామునకీ వార్త తెలిసి యాతఁడు తన సేనలను దూర్పు గవని యొద్దకు నడిపించెను. ఈ యదనునందే యాంధ్రులు మఱిపదివేల సైన్యము గవను నుండి వెల్వడి రుద్రదామునికి వెనుక నుండి యొత్తిడి చేసిరి. సాయంకాలము వఱకు రుద్రదాముఁడు వెనుదగిలివచ్చుచున్న సేనతోఁ బోరుచు తూర్పు గవని యొద్దకు నడచునప్పటికిఁ బదివేల సైన్యమును గోల్పోయెను. ఇట్లు సగము సైన్యము శత్రుపక్షమునఁ జేరఁగా మిగిలిన సైన్యములోఁ గొంత నశించగాఁ దక్కిన సైన్యమును రుద్రాణీరుద్రదాము లెట్లో నిలువరించి పోరి కాయిత మొనరించిరి. సూర్యుఁ డస్తమించెను.

---

# ౧౨

మఱునాటి యుదయమున శాతకర్ణి మఱల గవను దెఱిపించి దొమ్మికయ్యమున కాయ త్తమైవచ్చెను. ఆనాఁడు శాతకర్ణి యుద్ధరంగమునఁ ద్రిపురాసుర సంహార మొనర్చిన రుద్రునివలెఁ బ్రకాశించుచుండెను. ఆయన కాఱిబడినవారెవ్వ రును బ్రాణములతోఁ బోవుటలేదు. శాతకర్ణి యొక శూకలా శ్వము నెక్కి చంద్రహాసధారియై శత్రుసంహారము సేయు చుండెను. మధ్యాహ్నమగుసరికి చక్రవర్తి స్వయముగ వేయిమంది వీరభటుల నుఱుమాడియుఁ గొసంతయైన యలసట యెఱుఁగక యుద్ధకాంక్షియై యుండెను. ఆయన కెదురుగఁ బోవుట కెవ్వరికిని గుండె చాలకుండెను. మధ్యాహ్నవేళకు శాతకర్ణి శత్రుసేనామధ్యమునకు జొచ్చుకొనిపోయెను. ఆయన కిరుప్రైపుల శత్రువులు బీనుగుపెంట లగుచుండిరి. శాతకర్ణి కప్పటికిని గసితీరలేదు. ఇంతలో శత్రువుల యదృష్టవశమున నపరాంతకసైన్యము పశ్చిమదిక్కు నుండి వచ్చిపడినది. ఆంధ్రు లకుఁ బోరు భరమయ్యెను. శ్వేతగిరి సైన్యము సుశిక్షితము కాకపోవుటచే నాంధ్రుల పని యింతవఱకు సులభతరముగ నడిచి పోయెను. సోపారసైన్యము సుశిక్షితమైనది. వారు పర్వతవాసు లగుటచే దృఢకాయులు. సర్వాయుధ విశారదులు. ఆంధ్రులు కొంచెము వెనుకంజ వేయవలసివచ్చెను. కాని శాతకర్ణి నోరికండ తప్పినవ్యాఘ్రమువలె గాంద్రుమనుచు శత్రుసైన్యములదాకెను.

ఆతని కోట్లలకు శత్రువు లోహాటించు చుండిరి. ఇంతలో రుద్రాణి వెనుకంజ వేయుచున్న తన సైన్యములను హెచ్చరించి యశ్వారూఢయు ఖడ్గపాణియునై శాతకర్ణిని దాకెను. శాతకర్ణిని దాకెననఁగా నామె యుద్దేశపూర్వకముగఁ దాకలేదు. పరిస్థితుల ప్రభావముచే నా యాల్మగ లిర్వురు నట్లు మార్కొనిరి. ఇంతలో నొక వింత సంఘటనము జరిగెను. శాతకర్ణి వీరావేశమున శత్రుసంహారము చేయుచుఁ జేయుచు హాఠాత్తుగఁ దనకన్నులఁబడిన రుద్రాణివంక కేగుటలో నతని యశ్వము దైవవశమున వెనుకంజవేసెను. రుద్రాణి యశ్వము హేషాభీకరముగ నెదుటి యశ్వముపైఁ బరవళ్లు ద్రొక్కుచు నెదురయ్యెను. శాతకర్ణి రుద్రాణితో 'నీవు వచ్చితివా?' ఇదిగో నే నస్త్రసన్యాసము చేయుచున్నాను. నీవు నన్ను బంధించుటయో సంహరించుటయో చేయుము. నా ప్రణయమునకీ యాత్మార్పణము శాశ్వతచిహ్నమై వెలయఁగలదు. అట్లు రిచ్చవడి చూతువేమి ? ఖడ్గము నెత్తి ప్రహరింపుమని చేతనున్న చంద్రహాసమును జాఱవైచి యశ్వమును రుద్రాణీ సమీపమునకు నడిపించెను. రుద్రాణి యప్రతిభయై చిత్తరువువోలె గుఱ్ఱముపై చేతనారహితయైనట్లు కానవచ్చెను. కాని హఠాత్తుగ నొక యాపద సంభవించినది. అపరాంతక సేనాధిపతి విద్యాశ్రీ గుఱ్ఱమును దాటించి నిరాయుధుఁడై యున్న శాతకర్ణి తలపై బలమైన ఖడ్గప్రహారము చేసెను. దానివల్ల శాతకర్ణి కిరీటము భూపతితమై యతని శిరస్సున బలమైన గాయము తగిలి యాతఁడు గుఱ్ఱముపై వ్రాలిపోయెను. మిత్రులు

శత్రువులు గూడ హాహాకారములు చేసిరి. పడిపోవుచున్న శాత కర్ణిని మఱలఁ బ్రహరింపఁ గత్తినెత్తిన విద్యాశ్రీ దక్షిణబాహువును రుద్రాణి మెఱపు మెఱసినట్లు ఖండించివైచెను. విద్యాశ్రీ యామెవంక దిగాలుపడి చూచెను. భదంతుఁడు కోపోద్రిక్తుడై రుద్రాణి పైకి గుఱ్ఱమును నడిపెను. ఆమె గుఱ్ఱమును దాటించి భదంతుని రెండు తుండెములుగా నఱికివైచెను. విద్యాశ్రీ కిది యేమియో యర్ధముకాలేదు. అతని సేనాపతి చంద్రశ్రీ రుద్రాణిపైకిఁ దన సైన్యమును బురికొల్పెను. రుద్రాణి దుర్గవలె విజృంభించెను. అపరాంతక సేనలు కుప్పలు కూలిపోవుచుండిరి. ఆంధ్రులు రుద్రాణికి బాసటయైరి. రుద్ర దాముఁడు గుఱ్ఱముపైఁ జిత్తరువువలెఁ గూర్చుండి యీ నాటకమును దిలకించుచుండెను. ఆతని నెవ్వరును బలుకరింపరైరి. భదంతుఁడు చచ్చెను. త్రిపురారి స్వర్గస్థుఁ డయ్యెను. రుద్రదాముఁడు తటస్థుఁడై యుండెను. రుద్రాణి పరపక్షమునఁ జేరి స్వసేనాసముదయముల నుఱుమాడుచుండెను. అపరాంతక సేనలు కూడఁ జాలవఱకు నష్టమైపోయినవి. వారీ పరిస్థితులచే మొగముమొత్తి సమరపరాఙ్ముఖులైరి. శ్వేతగిరి సైన్యములో హతశేషులు పలాయనము చిత్తగించి చెట్లను బుట్టలను బట్టి పోయిరి. ఇట్లు విజయలక్ష్మి సమేతయై తన బిడ్డలను దానే యాహరించు యీనిన పులివలె గాండ్రించుచు రుద్రాణి వెనుదిరిగి ప్రతిష్ఠానపురోన్ముఖియై వచ్చుచుండెను. కోట గవని యొద్దకు రాగా, వాసవీదేవి సపరివారయైవచ్చి కోడలి నాహ్వానించి లోనికి గొనిపోయినది.

## ౧౩

శాతకర్ణికిఁ బ్రమాదమైన దెబ్బ తగిలినది. ఆయన నెల దినములకుఁ గాని మఱలఁ గోలుకొనలేదు. మొదట వారము దినములు స్మృతియే లేకుండెను. జ్వరపీడితుఁడై కలవరింత లాడుచుండెను. రుద్రాణి బాష్పావృతముఖి, దీనావనతనేత్ర, పరితాపతప్తహృదయ, నిరంతరము నాయన పజ్జనే యుండి యుపచారము చేయుచుండెను. వాసవీదేవి వచ్చి కోడలి సేమము నారయుచుండెను. రుద్రాణి యా వారము దినములు నుపవాసమే చేసెను. వారము దినములకు శాతకర్ణి కన్నులు తెఱచెను. రుద్రాణిని జూచి మందహాసము చేసెను. ఆ పతివ్రత పతిశిరస్సున బాష్పధారాభిషేక మొనర్చెను. శాతకర్ణి నీరసముగా నామెచేతిని దెమల్చి యోదార్చెను. రుద్రాణి శాంతించి యానాఁడు భర్తతోపాటు ప్రాశన మొనర్చెను. రెండు మూఁడు దినములకు శాతకర్ణికిఁ గొంచెము బలము వచ్చెను. స్వరములో హీనత తగ్గెను. ఆయన యీ మంత్రమును బఠించెను. "ద్వాసుపర్ణాసయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్నన్యో అభిచాకశీతి." రుద్రాణి భర్తృవక్షస్థ్సలమున శిరస్సునుంచి చాలసేపటివఱకుఁ గుమిలిపోయెను. శాతకర్ణి యామె శిరోజముల నిమురుచుఁ బసిపిల్లనటు లోదార్చుకొనెను. వారి బాష్పధారాస్రవంతులేకమై శయ్య యంతయుఁ దడిసిపోయెను.

* * * *

మూడేండ్లు గడిచినవి. రుద్రాణి కడుపు పండెను. యజ్ఞశ్రీ శాతకర్ణిమహాచక్రవర్తి జనించెను. శాతకర్ణి యారేండ్ల కుఱ్ఱవానినే సింహాసనమునం దభిషేకించి తాను వానప్రస్థుఁడౌదునని ప్రకటించెను. నీకంటె నెన్నో వెనుకలు వృద్ధుఁడను. నేను సంసారమును బట్టుకొని ప్రాకులాడుచుండఁగా నీ కింత చిన్నతనమున వైరాగ్యమేమి యని విష్ణుశ్రీదత్తుఁడు నిషేధించెను. చివర కాయన యనురోధముచేత శాతకర్ణి యాఱు మాసములు కొడుకుచెంత నుండి రాజ్య వ్యవహారములు చూచుటకును నాఱు మాసములు వానప్రస్థాశ్రమము నడుపుటకు నొడంబడెను. ఆ రాజ దంపతులు చైత్ర శుద్ధ పూర్ణిమ నుండి శ్రావణ శుద్ధ పూర్ణిమ వఱకును బదరికాశ్రమమున నివసించుచు వానప్రస్థము నెఱపుచుండిరి. తక్కిన యాఱుమాసములు ధాన్యకటకమున నుండి రాజ్య వ్యవహారములు నిర్వర్తించుచుండిరి. యజ్ఞశ్రీకి పదునాఱేండ్లు వచ్చువఱకు నిట్లు జరిపి యాపైఁ గేవలము బదరికాశ్రమమునందే నివాసముగ నుండిరి. ఆఱు నెలలు జోగీమఠము నందును నాఱు నెలలు బదరియందును గాలక్షేపముచేయుచుండిరి. నిత్యము నలకనందా పవిత్రతోయముల స్నానముచేసి, బదరీనారాయణస్వామిని సేవించి కృతార్థులై నరనారాయణ పర్వత సానువులందుఁ జరించుచు బ్రహ్మానందము నొందుచుఁ దుదకు విదేహకైవల్యమును సమార్జించిరి. నాగవల్లికయు వారి ననుగమించెను.

—: o :—

శివాజీ ప్రెస్, సికింద్రాబాద్. (ఎ. పి.)